# ప్రబుద్ధాంధ్ర



౧౫ పిబ్రవరి ౧౯౩౬

వార్షిక సంచికతో చందా ౧—౮—౦

సంపాదకుడు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# బెజవాడ సరస్వతీ బుక్ డిపోవారి స్వంత ప్రచురణములు

## డిటెక్టివు నవలలు

| | | | | |
|---|---|---|---|---|
| బంగారు బరిణె | I | 1 | 0 | 0 |
| డిటో | II | 1 | 0 | 0 |
| సుడిగాలి | I | 1 | 0 | 0 |
| డిటో | II | 1 | 0 | 0 |
| శిశుహత్య | I | 1 | 0 | 0 |
| డిటో | II | 1 | 0 | 0 |
| డిటో | III | 1 | 0 | 0 |
| యమదూత | | 1 | 0 | 0 |
| మండ్రగబ్బ | I | 0 | 12 | 0 |
| డిటో | II | 0 | 12 | 0 |
| రక్తజ్వాల | I | 0 | 12 | 0 |
| డిటో | II | 0 | 12 | 0 |
| గజదొంగ | | 0 | 12 | 0 |
| సరళ | | 0 | 12 | 0 |
| నారీపిశాచి | | 0 | 12 | 0 |
| ప్రతాపదౌర్జన్యము | | 0 | 12 | 0 |
| చోరాగ్రేసరచక్రవర్తి | | 0 | 12 | 0 |
| పేటికాంతరశవము | I | 0 | 12 | 0 |
| డిటో | | 0 | 12 | 0 |
| విషజ్వాల | | 0 | 12 | 0 |
| హత్యావినోదిని | | 0 | 12 | 0 |
| ఇందిర | | 1 | 0 | 0 |
| వాడేవీడు | | 0 | 12 | 0 |
| ఘోరకలి | | 0 | 12 | 0 |
| రూపసుందరి | | 0 | 12 | 0 |

## చరిత్రాత్మక నవలలు

| | | | | |
|---|---|---|---|---|
| వనదుర్గము | | 1 | 0 | 0 |
| తపోవనము | | 1 | 0 | 0 |
| జపమాలిక | I | 1 | 0 | 0 |
| డిటో | II | 1 | 0 | 0 |
| లాసిషా | | 1 | 0 | 0 |
| మూనసింగు | | 1 | 0 | 0 |
| కిశోరి | | 1 | 0 | 0 |
| కాళిదాసభవభూతులు | | 1 | 0 | 0 |

## వివిధ రకములు

| | | | | |
|---|---|---|---|---|
| మహాపతివ్రతలకథలు | | 0 | 8 | 0 |
| అదృష్టదీపిక | | 0 | 12 | 0 |
| జ్యోతిషఫలప్రదర్శని | | 0 | 12 | 0 |
| దస్తావేజుమతలబు | | 0 | 8 | 0 |
| దండకరత్నములు | | 0 | 6 | 0 |
| పన్నెండురాజుల కథలు | | 0 | 12 | 0 |
| హిందూస్తానీ తెలుగుబోధిని | | 0 | 6 | 0 |
| హిందీబాలశిక్ష | | 0 | 3 | 0 |
| ఘాలి సుబ్బారావు పాటలు | I | 0 | 12 | 0 |
| డిటో | II | 0 | 12 | 0 |
| వేడుకపెండ్లిపాటలు | | 0 | 8 | 0 |
| మహిళామనోరంజని పాటలు | | 0 | 5 | 0 |

## వైద్య గ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| గృహవైద్యచికిత్సారత్నము | | 1 | 0 | 0 |
| డిటో | II | 1 | 0 | 0 |
| ఆయుర్వేదవైద్యసారము | | 1 | 0 | 0 |
| పశువైద్యము | | 0 | 6 | 0 |
| గోసాయిచిట్కాలు | | 0 | 8 | 0 |
| వస్తుగుణప్రదీపిక | | 4 | 0 | 0 |
| మనయింటివైద్యుడు | | 0 | 6 | 0 |

## ప్రబంధములు

| | | | | |
|---|---|---|---|---|
| భాగవతరత్నములు | | 1 | 0 | 0 |
| వేమనరత్నములు | | 0 | 12 | 0 |

మా వద్ద అనేకరకములు గలవు. కోరినవారికి నూరుపేజీల కేటలాగు ఉచితముగా పంపబడును.

వలయువారు:— **కురుకూరి సుబ్బారావు**, ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.





సంపుటము ౨ రాజమహేంద్రవరము ౧౫ ఫిబ్రవరి ౧౯౩౬ ౨ వ సంచిక


# నిగళ బంధనం

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు

జనవరి సంచిక తరవాయి

మూడో రంగం

(ఓబమ్మ నగరు. ఆమె వొక గదిలో పీటమీద కూచుని వుంటుంది. ఆమెకు రెండుమూడు గజాల దూరంలో మరో పీటమీద తిమ్మరుసయ్యంగారు కూచుని వుంటాడు)

ఓబమ్మ—రోజులు వెళ్లిన వెంటనే అబ్బాయికి పట్టాభిషేకం అయిపోవాలి. ఆలస్యం కావడానికి వల్లకాదు.

తిమ్మరుసు—అలాగే. ఆలస్యం యెందుకూ? నిజానికీ, యిలాంటి పనులకు ఆలస్యం చెయ్యనే కూడదు. పొద్దున్నే సిద్ధాంతిగారిని కబురుచేసి కనుక్కున్నాను. పదమూడో రోజునే మంచి ముహూర్తం వుందన్నారు వారు.

ఓబమ్మ—బాగుంది. ఈలోపున సన్నాహా లన్నీ పూర్తిచేయించండి తమరు.

తిమ్మరుసు—చెయ్యవలసిన వన్నీ నేను జాగ్రత్తగానే చేస్తున్నాను. అయితే, తమరు పైపెత్తనాని కెవరిని నియమించారో తెలిస్తే—(అర్థోక్తి)

ఓబమ్మ—తమ రుండగా మళ్లీ యెవరో యెందుకూ? కాకపోయినా, దాయాదులను నమ్మడానికీ, చేరదియ్యడానికీ వల్లకాదు. నావెంపువారిలో సొంతపనులు విడిచిపెట్టి వచ్చేవా రెవరూ లేరు. కోడలివెంపువారిని చేరదీస్తే ముందుముందు విషమిస్తుంది. అబ్బాయిని తలుచుకుంటూ కంటికీ మంటికీ యేకధారగా దుఃఖిస్తోంది కోడలు. లేకపోతే సర్వమూ ఆమే చక్కబెట్టుకోగలదు.

తిమ్మరుసు—అవునవును. మహారాజులుంగారు కూడా యీసంగతి చాలామాట్లు సెలవిస్తూవచ్చారు; కాని, పాపం, యింకా వచ్చేకాలం. కొనసాగుతూ కొనసాగుతూ వున్న లతకూనను చిదిమేశాడు భగవంతుడు.

ఓబమ్మ—అంమచేత, కడుపుచిచ్చు తటస్థించినా నాకిప్పుడు తప్పదు. ఏంచెయ్యనూ? దుఃఖం దిగమింగుకోవాలి.

తిమ్మరుసు—ఇంతకంటే మంచి వుపాయం మరి లేదు. కాని బంధువులు అన్యథా భావించకుండా—(అర్థోక్తి)

ఓబమ్మ—ఆజాగ్రత్త అంతా నేను పడతాను కాదూ? (లాలసతో) అయితే, అక్కడి సంగతు లేమేనా తెలిశాయా?

తిమ్మరుసు—తెలవడానికీ, తెలవకపోవడానికీ యేం వుందీ? కొడుకుకోసం చాలా దుంఖిస్తున్నారు వారు. "పుత్రోత్పత్తివిపత్తిభ్యాం—" ఇది తమకి తెలవందా?

ఓబమ్మ—తెలవడం యేమిటి, యిప్పు డనుభవంలోనే వుంది కాదూ? శ్రీహరీ! తలుచుకున్నా, తలుపుకి





నచ్చినా మెగులు తరుక్కుపోతాయి పంతులుగారూ! ప్రగవాళ్ళకి కూడా యిదివద్దు మహాప్రభో! ఇది కత్తికోతకంటె అన్యాయం. రామరామా!......నాకొమారుడున్నప్పుడు నాకు లోటంటూ కనపడేది కాదు. ఇప్పుడు ఎటుచూసినా శూన్యం, అంధకారం; కాని అక్కడి సంగతులు చెప్పారు కారు.

తిమ్మరుసు—మనోవర్తిదారురాలు, ఆవిడవల్ల యేదో అవుతుం దని నునకి జంకెందుకూ అమ్మా?

ఓబమ్మ—చివరి, కయినా మానినా యెత్తులు వెయ్యవచ్చు కాదూ? ఉపాయాలు పన్నవచ్చు కాదూ? పైగా, అసలువా ళ్లూరుకునే వుంటె మధ్యవాళ్లు తిన్నగా వుండరు కాదూ?

తిమ్మరుసు—ఇంతవరకూ అలాంటి సంగతు లేమీ తెలవలేదు.

ఓబమ్మ—తమరు బాగా గమనిస్తూ వుండాలి. ఏపుట్టలో యేపాముందో—(అర్థోక్తి)

తిమ్మరుసు—తమ రింతగా సెల వివ్వాలా? తమ పోష్యవర్గంలోవాణ్ణి. నాశక్తియుక్తులూ, నాజీవితమూ—ఈతనువు విజయనగరప్రభువుల సేవలోనే చివరి కవుతూ యిపోతుంది.

ఓబమ్మ—తమ అనుగ్రహానికి చాలా సంతోషం. ఎలాగో యిక పదిహేన్నాళ్లు వేళ్లు మనకు కొంచెం కష్టపడి తిమ్మా, తరవాత అంతా అబ్బాయే చూసుకోగలడు.

తిమ్మరుసు—పదేళ్లు కూడా అక్కర లేదు. అబ్బాయిగారి మనుకు నేనెంగనిదా? పదహారేళ్లు వచ్చాయంటె—(అర్థోక్తి)

ఓబమ్మ—తమరు చూడాలి.

తిమ్మరుసు—తమరు నాదాకా అట్టపెడితే అలాగే.

ఓబమ్మ— అట్ట పెట్టకపోడానికి నేనెంతటిదాన్ని నాయనా? ఆమహారాజూ లేక, ఒక్కగా నొక్క కొడుకూ లేక—ఏదో విధిలేక బతికివున్నాను నేను. అయినా పుట్టింది రాచపుట్టుక కనక, వయస్సు మళ్లినా రామా కృష్ణా అనుకుంటూ కూచోకుండా భగవంతుడు నామీద యిలాంటి భారం మోపాడు కనక ప్రవృత్తిమార్గంలో దేవుళ్లాడక తప్పదు. ప్రజాపాలనం అన్నప్పుడు మంచీ చెడ్డా కూడా వుంటాయి. లోకులు కాకులు. ఎంతచెట్టు కంత గాలి వుంటుం దనీ, స్థితిగతుల ననుసరించి నడుచుకోవా లనీ, యెవరి కేం కష్టసుఖాలున్నాయో అనీ యెవరూ యోచించరు. ఒక్కొక్కప్పుడు, నిజం తెలుసుకోలేక మంచిని కూడా చెడ్డగానే పరిగణిస్తారు. పైగా అపక్షంవారు నామీద దుర్వాదంతులు వ్యాపింపచేస్తారు. తమరు కనుగలిగివుండాలి.

తిమ్మరుసు—చిత్తం చిత్తం. నావల్ల యేమీ లోపం జరగదు.

ఓబమ్మ—ఈదుఃఖసమయంలో తమరే మాకు దిక్కు. తమకు పదిమాట్లు చెప్పనక్కరలేదు. కర్ణాటకసామ్రాజ్యంలో యేవిషయంలోనూ తమచేతి కష్టు లేదు. తమ రనుభవించగా మిగిలిందే మాకు చాలు.

తిమ్మరుసు—ఎంత మాట సెల విప్పించారూ తమరూ? డబ్బా నాకు ప్రధాన మైనది? కైలాసవాసి నరసరాయలవారు నన్ను చేరదీసి వొక యింటివాణ్ణి చేశారు. వారి కుటుంబం యిప్పుడు కొంచెం చిక్కుల్లో వుంది. ఇప్పు డుపకరించకపోతే యిక నేనెందుకూ? విశ్వాసం చూపించడాని కింతకంటె మంచి సమయం యేం వుంటుందీ నాకూ? తమ భర్తగారూ, తమ కొమారుడుగారూ నాయెడల కనపరిచిన అనుగ్రహానికి, నాచర్మం చెప్పులు కుట్టించి తొడిగినా ఋణం తీరదు. అమ్మా! తమ రెప్పుడూ డబ్బు మాట యెత్తకండు. ఇదివరకెప్పుడూ మాకు లోటు జరగలేదు. ఇక ముందు జరగదు. నాకా సందేహం యెప్పుడూ లేదు.

ఓబమ్మ—ఎలాంటి హేమాహేమీలుగా కూడా యీసంసారజంజాటంలో పడి కొట్టుకోడానికి డబ్బే కాదూ కారణం? తమరు మరోలాగ చేస్తారని నేను డబ్బు ప్రస్తావన తేలేదు. నాభర్తగారూ, నాకొడుకూ కూడా తమర్ని బాగానే చూశారు. నావిషయం తమకు కొత్త కాబట్టిన్నీ, తమరు వారి హయాములో యెటువంటి స్వేచ్ఛ అనుభవించారో నాహయాములోకూడా అలాంటిది నిరాటంకంగా అనుభవించవచ్చు నని తమకు

విశదం కావలసివుంది కాబట్టన్నీ అలా చెప్పాను; కాని తమరు డబ్బుకోసమే పనిచేస్తున్నా రనా? ఇంతకీ: ఊరికే పేరుమట్టుకే మాదీ. ఖజానా అంతా తమ అధీనంలో వుండవలసిందే. ఎప్పుడైనా సరే, యెందు కయినా సరే, యెంతయినా సరే, యేవిధంగా అయినా సరే, తమ యిష్టం. ఏమీ సందేహం అక్కర్లేదు. అబ్బాయి పెద్దపెరిగే దాకా సామ్రాజ్యం కాపాడి, తరవాత అతడు సొంతంగా వ్యవహారాలు చక్కబెట్టుకుంటూ వుంటే చూసి ఆనందించడమే మన పని.

తిమ్మరుసు—చిత్తం చిత్తం.

ఓబమ్మ—నేను పాపం చేసుకున్నాను. లేకపోతే నాకీ పాట్లెందుకు వస్తాయీ? ఆమహారాజు లేకపోయినా కడుపున పుట్టిన కొడుకేనా పదికాలాలపాటు బతికి వుండకూడదూ పంతులుగారూ? (దుఃఖం గుటకలు వేసి ఒక్కక్షణం సమాళించుకున్న ట్లభినయించి) పూర్వ జన్మంలో చేసుకున్నది అనుభవించకతప్పదు. ఒక్కొక్కప్పుడు దుఃఖం వుబ్బెత్తుగా పొంగి యిక శరీరం తెలవదు. అలాంటప్పుడు "ఛీ! యెందు కీబతుకు" అని పిస్తూవుంటుంది; కాని పసివాడికోసం అంతా దిగమింగుకుంటున్నాను. తమరు నెయ్యికళ్లతో కనిపెట్టుతూ వుండాలి.

తిమ్మరుసు—నిజమే. తమవంటి మానవతులకు—దయార్ద్రహృదయం గలవారికి యిలాంటిది వచ్చినప్పు డెంత దుఃఖం కలుగుతుందో వేరే సెలవివ్వాలా? అయినా, తమకు చెప్పవలసిం దేమీ లేదు. "జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం—" మరిచిపోవాలి.

ఓబమ్మ—దేవుడా! ఈవయస్సులో నా కిలాంటి అనుభవం తెచ్చిపెట్టవా అని వొక కంట దుఃఖిస్తూనే వున్నాను. తమరు సెల విచ్చినట్టు పిల్లవాడికోసం ధైర్యం అవలంబించక తప్పదు.

తిమ్మరుసు—తమరు దుఃఖిస్తే కోడలుగారు మరింత బెంబేలుపడిపోతారు. తమ రిద్దరూ అలా వుంటే యిక అబ్బాయిగారిని పట్టడం కష్టం. సంసారంలో పెద్దవాళ్లుండగా చిన్నవాళ్లు పోతే యిదే చిక్కు. ఎంతెంతలేసి ఆపదలు వచ్చినా కుక్కిన పేనులాగ పడివుండాలి; గాని నోరారా యేడ్చి ఆభారం తగ్గించుకోడానికి వీలుండదు.

ఓబమ్మ—యిప్పుడు నాగతి అలాగే వుంది.

తిమ్మరుసు—ఏంచెయ్యగల మమ్మా? అనుభవం వొక్కటే యిందుకు దారి. దుఃఖం వచ్చిం దంటే యిక అక్కడ అందరూ సమానమే—(అర్థోక్తి)

ఓబమ్మ—సమానమే అంటే నాఅవస్థ—(అర్థోక్తి)

తిమ్మరుసు—తమ విషయం వేరూ. భర్తగారు లేకపోవడం, నల్లరాయివంటి కుమారుడు అకాలమృత్యువు నోటపడడం. ఇంతమాత్రమే అయితే లోకంతో పాటే; కాని సామ్రాజ్యం? కోట్ల కొద్దీ జనులు తమ చల్లని నీడకోసం కనిపెట్టుకుని వున్నారు. ఇదీ విశేషం. మాటలతో అవుతుందా? అసలు, తమకు దుఃఖిస్తూ కూర్చోడానికి వీలేదీ?

ఓబమ్మ—అదీ మాట. తెలిసినవా ళ్ళూరుకునే వుంటారు. తెలవనివాళ్లే నాలిక బుజానవేసుకుని బయలుదేరతారు.

తిమ్మరుసు—వాళ్ళ ప్రస్తావన మన కక్కర్లేదు. మన స్థితిని బట్టి, మనం చెయ్యవలసిన పని చేస్తాం. ఇందులో యెవరూ యేమీ అననలసింది లేదు.

ఓబమ్మ—అదీ నిజమే.

తిమ్మరుసు—ఎవ రేనా యేమేనా అంటున్నారేమో అని మనక ఆలోచన కూడా అక్కర్లేదు. మంచో చెడ్డో యేదో వొక మార్గం వేసుకోడమూ, ప్రాణాలు తప్పకుండా ఆప్రకారం నడిచిపోవడమూ—అమ్మా! మొదణ్ణుంచీ తమ సంగతి నాకు తెలుసునే. ఎప్పుడూ చలనం అంటూ యెరగని తమరిప్పు డిలా సందేహించడం—(అర్థోక్తి)

ఓబమ్మ—సందేహించడాని కేం వుంది పంతులుగారూ? లోకం సంగతి చెప్పాను. వాళ్ళమాటా, వాళ్ళ మాటా లెక్కచేస్తూ వుంటే పనులు సాగుతాయా?

తిమ్మరుసు—అలా నిశ్చయం చేసుకోవాలి. తమర్ని అడ్డగలవాడు భగవంతుడు తప్ప, యిప్పటినుట్టుకీ మరో కడు లేడు. తమకు సందేహమే వద్దు. విచారణ అవ

సరమే లేదు. సామ్రాజ్యం—ఇది వొక్కటే తమకు విషయం—మరి నేను తక్కిన సంగతులు చూడాలి. సెల విప్పించండి.

ఓబమ్మ—వెళ్ళిరండి నాయనా! రెండుపూటలూ తమరు దర్శనం దయచేస్తూవుండాలి.

తిమ్మరుసు—ఆసంగతి తమరు వేరే సెల వివ్వాలా అమ్మా? మధ్యాహ్నం భోజనం కాగానే వచ్చి దర్శనం చేసుకుంటాను.

ఓబమ్మ—కోడల్ని కూడా వోదారుస్తూ వుండాలి తమరు. మంచి అనుభవకాలంలో భర్తృవియోగం. పైగా, ఆమె చాలా అమాయకురాలు. భర్త అంటే నిద్రాహారాలు మరిచిపోయే దామె. స్వయంగా సేవలు చేసేది. అలాంటి ప్రేమవతి కిలాంటి దుఃఖం తెచ్చి పెట్టాడు దేవుడు.

తిమ్మరుసు—అవునవును. మంచివాళ్లకే యెప్పుడూ ఆపదలు వస్తాయి. వారి దర్శనం కూడా చేసుకునే వెడుతూ వుంటాను.

ఓబమ్మ—అబ్బాయి, ముందుముందు, గొప్ప సామ్రాజ్యం పరిపాలించవలసినవాడు. ధైర్యస్థైర్యాలు అలవడవలసిన వయస్సిది. ఇప్పుడు అతను దుఃఖంలో పడితే అతని జీవితం అంతా చెడిపోతుంది. ఈసంగతి వివరంగా బోధించి, తమరు, కోడల్ని వోదార్చాలి. నావార్ధకమూ అబ్బాయి చిన్నతనమూ చూపించి, "భారం అంతా తమమీదే వుంది"దని ఆమెని ప్రకృతిలో ప్రవేశ పెట్టాలి తమరు.

తిమ్మరుసు—చిత్తం చిత్తం.

ఓబమ్మ—మరి సెలవు.

తిమ్మరుసు—చిత్తం; సెలవు.

ఇద్దరూ లేచి గుమ్మందాకా వెడతారు.

ఓబమ్మ—తిమ్మరుసయ్యంగారూ! తమ రిక్కడికెప్పుడు వేంచేస్తే అప్పుడే నాకు దర్శనం యిప్పించాలి. సమయమో అసమయమో అని సందేహం అక్కర లేదు. విజయంచేసిన వెంటనే లోపలికి కబురు చేస్తే నేనే తమన్ని ప్రత్యుత్థానం చేసి—(అర్థోక్తి)

తిమ్మరుసు—ఎంతమాట సెలవిప్పించారూ? నేను భృత్యుణ్ణి కానా అమ్మా? తమ సెలవుప్రకారమే ప్రవర్తిస్తాను.

ఓబమ్మ—మరి దయచెయ్యండి.

తిమ్మరుసు—చిత్తం, చిత్తం.

(తిమ్మరుసు వెళ్లిపోతాడు. ఓబమ్మ మరి రెండడుగులు సాగనంపి మళ్లీ వెనక్కి వస్తుంది)

ఓబమ్మ—తిమ్మరుసయ్యకి ఆమెర చాలు. మామీద ద్రోహచింత లేదు బ్రాహ్మడికి. చిక్కురోజులు వచ్చాయి కనక యిలాంటివాళ్లు చాటునా మాటునా నాలుగు రాళ్లు కక్కూర్తిపడితే చూసీచూడనట్టు వూరుకుంటూ వుండాలి. ఏమీ యెరగనట్టు సొంతంగా కూడా కాస్తా కూస్తా ముట్టచెబుతూ వుండాలి. మారప్పకి ఆమాత్రం చాలు. రుక్కయ్యకి ఆమెర చాలు. కోనయ్యకి ఆఆశ చాలు. సాంబశివరాయడూ, త్రిలోచనరాయడూ, యెప్పుడూ చేతినుంచి జారిపోరు. విరూపాక్షరాయడు బాగా వుపకరిస్తాడు. జాగ్రత్తగా వినియోగించుకోవాలి. అంతా సవ్యంగానే వెడుతుంది.......కోడలు పుట్టెడు దుఃఖంలో వుంది. ఆమెకి అధికారవాంఛ లేనే లేదు; గాని ఘట్టకుండా జాగ్రత్తపడాలి. ఇక నాగమ్మా? హుహు. చెట్టంతకొడుకు బుగ్గయిపోయాక—యింకేం వుందని తల యెత్తుకుని తిరుగుతుందీ? అయినా పైవాళ్లు వూరుకోరు. చెప్పుడు మాటలు తొందరగా పనిచేస్తాయి. ఆవిడ బతికివుంటే రహస్యంగా నేనా కొందరు ఆవిడ పక్షం వహించవచ్చు; కనక వ్యవహారం యెదురుతిరిగిందంటే ఆవిణ్ణి కూడా కడతేర్చెయ్యాలి. అచ్యుతరాయడు ఏమంత తెలివయినవాడు కాడు. అయినా అతనిమీద కూడా వొకకన్ను వేసే వుండాలి. ఎవర్నీ పూర్తిగా నమ్మడానికి వల్లకాదు. చాలా జాగ్రత్తగా వుండాలి. (ఎదటి గుమ్మం కేసి చూసి) ఎవ రక్కడ?

తెరలో

హాజర్ అమ్మా!

ఓబమ్మ—విరూపాక్షరాయణ్ణి తీసుకురావే.

తెరలో

చిత్తం అమ్మా!

ఓబమ్మ—నాస్నానం పూర్తి అయాటప్పటికి అత డిక్కడ వుండాలి.

తెరలో

మంచిదమ్మా!

నాలుగో రంగం

(రుక్కమ్మ నగరు. ఆమె వొకపీటమీద కూచుని వుంటుంది. ఆమెకి రెండుమూడు గజాల దూరం లో తిమ్మరుసు మరో పీటమీద కూచునివుంటాడు).

రుక్కమ్మ—అత్తయ్యగా రేం సెల విచ్చారు బాబయ్యగారూ?

తిమ్మరుసు—సెల వివ్వడాని కేం వుంది తల్లీ? వృద్ధాప్యంలో వారికి కడుపుచిచ్చు తటస్థించింది. ఇక ఆదుఃఖం ఇంతా అంతా అని చెప్పడానికి వల్లకాదు. భారం అంతా తమ మీద వుందని సెల విచ్చారు వారు.

రుక్కమ్మ—ఇక నావల్ల యేమవుతుంది తండ్రీ? ఆమహారాజుకి సేవ చేసుకుంటూ అత్తయ్యగారి చాటున వుండవలసినదాన్ని నేను. నాబతు కిలా అయిపోయింది. ఒక మూల పడివుండడం తప్ప యిక నావల్ల యేమీ కాదు. పెద్దవా రయినందుకు భారం అంతా వారిదే అని విన్నవించండి.

తిమ్మరుసు—ఇద్దరూ అలాగే అంటే యెలాగ అమ్మా? ఇది గొప్ప ఆపత్తే. దాన్లో సందేహం లేదు; కాని అబ్బాయిని చూసుకోవద్దూ? సాటి లేని సామ్రాజ్యం చక్క బెట్టుకోవద్దూ? అబ్బాయి పెరిగి పట్టానికొచ్చే దాకా తమ రిద్దరూ దుఃఖం మరిచిపోవాలి.

రుక్కమ్మ—నాకు, మరుపు వచ్చే దుఃఖమే తెచ్చిపెట్టాడా యీశ్వరుడు నాయనగారూ?

తిమ్మరుసు—లేదుతల్లీ లేదు; కాని దుఃఖానికి సమయాసమయా లున్నాయి. స్థితిగతులు కొంచెం చూసుకోవాలి.

రుక్కమ్మ—దేవుడు చేసింది కొంతా మనుష్యులు చేసింది కొంతానూ. మరిదిగారు బతికివుంటే నాబిడ్డకి అపకారం జరుగునా బాబయ్యా?

తిమ్మరుసు—నిజానికి, వా రలాంటివారు కారు కాని యెప్పటి కేమిటో యెవరు చెప్పగల రమ్మా? అత్తయ్యగారికి మొదట్నుంచీ వారిమీద అనుమానమే. మహారాజులుంగారు తల్లి ఆలోచన కంగీకరించారు.

రుక్కమ్మ—కనకనే యిలా జరిగింది. అపకారం జరుగుతుం దేమో అని అత్తయ్యగా రంత పని చేయించారు. చిన్నత్తయ్యగారి పక్షంవారు కూడా అలాంటి పని చెయ్యడానికి సాహసిస్తా రేమో యెవ రేనా యోచించారా?

తిమ్మరుసు—అలాంటి భయం అక్కరలేదు తల్లీ!

రుక్కమ్మ—మరిదిగారు ప్రాజ్ఞత వచ్చినవారు. వీరాధివీరులు. అనేక యుద్ధాలలో జయలక్ష్మిని పొందినవారు. అలాంటివారికే అలాగ చిత్రవధ తటస్థించినప్పుడు యెనిమి దేళ్ల నిసుగు—ఇక నాబిడ్డని బతకనిస్తారా తండ్రీ?

తిమ్మరుసు—మేమంతా యేమయిపోయాము తల్లీ? అబ్బాయిగారిమీద యీగ వాలనిస్తామా? తమ కేమీ బెంగ అక్కరలేదు.

రుక్కమ్మ—ఈశ్వరసంకల్పం యెలావుందో? అత్తయ్యగారి హృదయంలో యింకా యెలాంటి కల్పనలు పుడుతున్నాయో? చిన్నత్తయ్యగారిని కూడా కడతేర్చే వుపాయాలు జరక్కుండా కనిపెట్టాలి సుమండీ తమరు. ఇప్పటికి కీకుటుంబంలో బుల్లిమరిదిగా రొక్క రే పెద్దలు. వారికి కూడా అపాయం కలక్కుండా జాగ్రత్తపడాలి తమరు.

తిమ్మరుసు—ఇం కేమీ భయం లేదు. అచ్యుతదేవరాయలవారు అత్తయ్యగారి చెప్పుచేతల్లో వున్నారు. కనక వారి కేమీ అపాయం కలగదు. చిన్నత్తయ్యగారికిం కేమీ చిక్కులు కలక్కుండా వుండడానికి నేను పూచీ.

రుక్కమ్మ—నాబిడ్డకి రాజ్యం వచ్చినా మంచిదే, రాకపోయినా మంచిదే, వంశనాశనం మాత్రం కాకుండా చూడండి నాయనగారూ? మామయ్యగారి సంతానంలో వొక రకాలమరణమూ, వొకరు దారుణమరణమూ పొందారు. ఇక వొక్క రున్నారు. ఆవంశాంకురం నాబిడ్డ వున్నాడు. ఈయిద్దరివల్ల నేనా మళ్ళీ యీవంశం విస్తరించేలాగ చూడండి బాబయ్యగారూ! మామయ్యగారు ముగ్గురు భార్యలను పెళ్ళాడినా, ముగ్గురూ సంతానవతులే అయినా యీవంశం సంగతి నేను సందేహంలో పడిం

డి. నాబిడ్డకి సామ్రాజ్యం లేకపోయినా సరే యింకేమీ దారుణాలు జరక్కుండా చూడండి బాబయ్యా!

తిమ్మరుసు—పదిమాట్లు చెప్పడం యెందుకు తల్లీ? అత్తయ్యగారిప్పు డేమీ దుస్సంకల్పాలు చెయ్యడం లేదు. తమరు నిశ్చింతగా వుండవచ్చు.

రుక్కమ్మ—బాబయ్యా! మరిదిగారు నిజంగా చచ్చే పోయారా? బతికివుంటే ఆకబోది నేనా చూసుకుంటూ కాలం గడుపుకుంటారు చిన్నత్తయ్యగారు. నాబిడ్డ కూడా వారి వుసురు తగలకుండా సుఖంగా వుంటాడు.

తిమ్మరుసు—కళ్లు పీకించమని మాత్రమే మహారాజు సెలవిచ్చారు. అది అయిపోయాక, కృష్ణరాయలవారు—(అర్థోక్తి)

రుక్కమ్మ—కళ్లు పీకెయ్యనిచ్చారా మరిదిగారు?

తిమ్మరుసు—ఏంచెప్పను తల్లీ.........

రుక్కమ్మ—పరాక్రమించారా వారు?

తిమ్మరుసు—రామరామా! ఏమి త్యాగం తల్లీ వారిది? ఆసన్నివేశం చూశాటప్పటికి నాకు ప్రభువు మీద రోతపుట్టింది; కాని రాజాజ్ఞ అనుల్లంఘ్యం కావడంవల్ల—(అర్థోక్తి)

రుక్కమ్మ—ఏమి జరిగింది బాబయ్యా?

తిమ్మరుసు—చెప్పలేక చెప్పలేక నేను రాజాజ్ఞ మనవి చేసుకున్నాను. తలారి కైజారుదూసి సిద్ధంగా నుంచున్నాడు—(అర్థోక్తి)

రుక్కమ్మ—(కళ్లు మూసుకొని) శ్రీహరీ! శ్రీహరీ!

తిమ్మరుసు—నేను కృష్ణరాయలవారు విక్రమిస్తారనుకున్నాను; కాని అలాంటి దేమీ జరగలేదు.

రుక్కమ్మ—(చూస్తూ) రాజాజ్ఞ విని వారేం సెలవిచ్చారు బాబయ్యా?

తిమ్మరుసు—ఏమీ సెల వివ్వలేదు తల్లీ? ఎలా నుంచున్నవా రలాగే నుంచుని, మందహాసం చేస్తూ, చేతులు వెనక్కివిరిచికట్టుకుని తలారిని చూసి—(అర్థోక్తి)

రుక్కమ్మ—అయ్యో! అయ్యో! మాటమట్టు కేనా వ్యతిరేకం చూపించలేదూ?

తిమ్మరుసు—వ్యతిరేకమా తల్లీ! హరిహరీ! అనేక యుద్ధాలలో, వారు, శత్రుసంహారం చేస్తూవుంటే నేను కళ్ళారా చూశాను. ఎడమచేత జాలు పట్టుకుని, కుడిచేత ఖడ్గం యెత్తి, ఔడుకరిచి, కళ్లనుంచి నిప్పులు కక్కుతూ వారు వైరివీరుడిమీది కురుకుతూ వుంటే—ఆదృశ్యం అస్మదాదులకు కూడా వెరపు పుట్టించేది.

రుక్కమ్మ—తమ మాటలవల్ల వారి ఆమూర్తి నాకు సాక్షాత్కరించినట్టుంది బాబయ్యా!

తిమ్మరుసు—అలాంటి వీరాగ్రవీరులు చలనం లేకుండా నిలిచి, మందహాసం చేస్తూ, నాకేసి తిరిగి చూస్తూ నుంచి రాజాజ్ఞ అందుకుని, తలారి కేసి తిరిగి "రంగారు ఇడుగో. మహారాజులుంగారికి నాకళ్లతో పనివచ్చింది—(అర్థోక్తి)

రుక్కమ్మ—(కళ్లూ చెవులూ మూసుకుని) వినలేను బాబయ్యా! ఇక చెప్పవద్దు నాయనగారూ!

తిమ్మరుసు—యోగులలో కూడా అలాంటి వైరాగ్యం కనబడదమ్మ తల్లీ!

రుక్కమ్మ—అంతటి శాంతమూర్తిని నాబిడ్డకోసం చిత్రవధ చేశారా మహారాజు? శ్రీహరీ!

తిమ్మరుసు—వారు ఎదురుతిరిగివుంటే నాకు కష్టం లేకపోవును; కాని ఆసన్నివేశం నేను కూడా చూడలేక మొగం పక్కకి తిప్పుకున్నాను. ఏమయిందో అని వారికేసి మళ్ళీ చూస్తేనిగదా గుడ్లు పీకెయ్యడంవల్ల గుంటలు పడ్డ కళ్లలోనుంచి రక్తం ప్రవహించి ముఖమూ, వక్షస్థలమూ—శరీరం అంతా తడిసిపోయినా చలనం లేకుండా, దుఃఖం అనేది స్వప్నాలోకేనా రానీయకుండా తలారిని పిలిచి "చితికిపోకుండానూ, గింట్లు పడకుండానూ జాగ్రత్తగా తీశావా?—(అర్థోక్తి)

రుక్కమ్మ—(మొగం వంచుకుని చెవులు మూసుకుని) శ్రీహరీ! రామా రామా!

తిమ్మరుసు—"అవి మహామంత్రులవారి చేతిలో పెట్టు. మహారాజులుంగారిచ్చే బహుమతీ పుచ్చుకుని పెళ్ళాముబిడ్డలతో నువ్వు సుఖంగా బతుకు—(అర్థోక్తి)

రుక్కమ్మ—ఎంత మంచి హృదయం బాబయ్యా వారిది? ఆశౌర్యం అంతా ఏమయిపోయిందో తండ్రీ?

అలాంటివారు బతికివుంటే నాబిడ్డని కాదని సామ్రాజ్యం ఆక్రమించుకుందురా నాయనగారూ ?

తిమ్మరుసు—ఎవరు చెప్పగలుసు తల్లీ ?

రుక్కమ్మ—చెప్పలే కేమి బాబయ్యా ? అన్నగారి మొదల వారు కనపరిచిన భయభక్తులు నేనెరగనివా తండ్రీ ? అంతటి మహోదారులు నాపాలబుగ్గలవాడికి అపాయం కలిగించగలరా నాయనగారూ ? ఎంత ద్రోహం జరిగిందీ మరదిగారికీ ?

తిమ్మరుసు— ఇదంతా సానుకూలముఖంగా జరిగిపోం యీశ్వరనిర్ణయం. ఏమి చెయ్యనూ ? రాజాజ్ఞ. ప్రాణాల కేనా తెగించాను కాని యింతవరకూ నేనెప్పుడూ రాజాజ్ఞ జవదాటా లని ప్రయత్నించలేదు. ఊహించేనా యెరగను.

రుక్కమ్మ—అంతనమ్మిక మైనవారు కనక కే అత్తయ్యగారూ, మహారాజూ యిది తమకు ఆజ్ఞాపించారు. తరవాత యేం జరిగింది బాబయ్యా ?

తిమ్మరుసు—ఆపని అయిపోయాక, కృష్ణదేవరాయలవారు "ఇక నేను బతికివుండినా లాభం లేదు. బాధ కూడా సహించలేను. కనక తల కొట్టించి వెయ్యండి" అని బతిమాలుకున్నారు.

రుక్కమ్మ— (ఆత్రంతో) తమ రేమన్నారు బాబయ్యా ?

తిమ్మరుసు— తెల్లారితో "వారి యిష్టంవచ్చినట్టు చెయ్యి" మని చెప్పి నేను వచ్చేశాను.

రుక్కమ్మ—తమరు కూడా అంత కాఠిన్యం సహించా రేమిటి బాబయ్యా? ఆఖరికి నేనా తల్లిగారికి తక్కనివ్వగూడదా ?

తిమ్మరుసు—మహారాజులుంగారికి ఆకిల్లు చూపించాలన్న తొందరలో నాకు మరేమీ తోచలేదు తల్లీ ?

రుక్కమ్మ—తరవాత యేం జరిగిందీ ?

తిమ్మరుసు—వారు చనిపోయివుంటారు.

రుక్కమ్మ—తెలారి తమతో యేమీమానవిచెయ్యలేదూ?

తిమ్మరుసు—తరవాయి తీరిపోయిం దని—(అర్ధోక్తి)

రుక్కమ్మ—అంటే ?

తిమ్మరుసు—ఇక వివరా లెందుకు తల్లీ ?

రుక్కమ్మ—అత్తయ్యగారి సలహావల్లనూ, మహారాజు ఆజ్ఞవల్లనూ చుట్టబెట్టుకునే పాపంలో నాకూ పాలుంది. వధావిధానం వింటే కొత్తగా వచ్చే దేమీ లేదు. సెల విప్పించండి.

తిమ్మరుసు— నేను వెనక్కిమళ్లిన కొంతసేపటికి కాంద్రుకాంద్రు మంటూ పెద్దపులి వచ్చిందట.

రుక్కమ్మ—రామరామా ! పిచికిమీద బ్రహ్మాస్త్రం. కండకండాలుగా పీకేసివుంటుంది పులి. కళ్లున్న రోజుల్లో యెనోన్ని పులులనూ, సింహాలనూ పిడిగుద్దులు గుద్ది సంహరించినవారు వారు.

తిమ్మరుసు— సేవకులు భయపడి పారిపోయారుట. మర్నాడు మనిషి వెళ్లి చూస్తే అక్కడ యేమీ కనపడ లేదుట. వారిని పులి వేసేసి వుంటుం దంటాడు సేవకుడు.

రుక్కమ్మ—ఇంకా సందేహమూ ? అయితే, బాబయ్యా.ఏసామ్రాజ్యం కోసం వారు చిత్రవధకు పాల్పడ్డారో ఆసామ్రాజ్యం పాలిస్తే నాబిడ్డకు జయం వుంటుందా ?

తిమ్మరుసు—రాజనీతి వేరు కాదూ తల్లీ ? రాజకుటుంబాల చర్యలు లోకనీతి ననుసరించి విమర్శించకూడదు కాదూ అమ్మా ?

రుక్కమ్మ—ఈశ్వరుడికి కూడా అలాగ భేదబుద్ధి వుంటుందా ?

తిమ్మరుసు—ఈశ్వరనిర్ణయానికి వ్యతిరేకంగా యేదేనా జరుగుతుందా తల్లీ ?

రుక్కమ్మ—తమకు బదులు చెప్పలేను. బాబయ్యా! జరిగిం దేదో జరిగిపోయింది. ఇకమీద మాత్రం మరే దారుణాలూ జరక్కుండా చూడండి.

తిమ్మరుసు—నెయ్యికళ్లతో కనిపెడుతూవుంటాను తల్లీ!

రుక్కమ్మ—ఇక్కడికే భోజనానిక పొద్దుపోయింది. ఇక దయచెయ్యండి. మధ్యాహ్నం కూడా వోకమాటు దర్శనం యిప్పించండి.

తిమ్మరుసు—తప్పకుండా దర్శనం చేసుకుంటాను తల్లీ (లేచి నుంచుంటాడు)

రుక్కమ్మ—(లేచి) సెలవు.

తిమ్మరుసు—చిత్తం అమ్మా !

సశేషం

"అనవసరమూ, అనుచితమూ" అనే శీర్షికతో డిసెంబరు ప్రబుద్ధాంధ్ర (౧౦—౧౨—౩౫) లోని వ్యాఖ్యానాల్లో సంపాదకులు 'హిందూమహమ్మదీయ మైత్రిని' గూర్చి, "భారతభాగ్యశ్రేయోభివృద్ధికి, హిందూమహమ్మదీయ మైత్రి ముఖ్యావసరంగాన, స్త్రీలు సంపూర్ణసహాయసాను భూతులతో కృషి చెయ్యవలెనని ఈసభవారు కోరు చున్నారు" అని శ్రీమిమ్మదవ ఆంధ్రరాష్ట్రీయమహిళాసభ గుంటూరులో చేసిన తీర్మానాన్ని విపులంగా విమర్శిం చారు. వారి సంపాదకీయ ప్రధానవ్యాసమైన "రామ మూర్తిపంతులుగారితో ౩౬ గంటలు" వ్యాఖ్యానాల్లోని "కవిగారి షష్టిపూర్తి" అను రెండు వ్యాసాల్ని చూచి ముగ్ధులమై, తన్మయులమైన మాకు, అదే పత్రికలోని ఈవ్యాసానికంత విషాదం కలిగింది. మేము చేసిన తీర్మా నానికి మాకు ప్రతిఘటన, విమర్శన వచ్చిందని కాదు. అంత చక్కని లేఖకులు, విమర్శకులు, ఇంత అసమంజ సంగా వ్రాశారే! అని, సహజంగా శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారియందు, వారి రచనలయందు, అభిప్రాయాల యందు, నాకు చాలా గౌరవం, అభిమానం, ఉంది. ముఖ్యంగా వారికున్న ఆంధ్రాభిమానం హృదయ రక్తాన్ని ఉడుకెత్తించి, పరవశనుగా చేస్తుంది నన్ను. ఇటు వంటి జాతీయాభిమానులు నూటికొకరుంటే, ఎప్పుడో వచ్చి ఉండేదిగదా ఆంధ్రరాష్ట్రం, అని అనుకుంటూంటా. హిందీని గూర్చిన వారి వ్రాతలుకూడ అభిమానంతో చదువుతూ ఉంటా. కాని వారు ప్రస్తుతవిషయంలో మాత్రం చాలా పొరపడి, ఆ ఉద్రేకంలో చాలా అసం బద్ధంగా వ్రాశారని నావిశ్వాసం. నాకు గాక ఇంకెవ్వ రైనా ఈవ్యాఖ్యానం వ్రాస్తే, నే నంతగా లక్ష్యపెట్టి ఉండను.

ఇక ప్రశ్నలకొసిక వస్తా. ఎక్కువ విమర్శనీయమైన జవాబియ్యాకి క్లుప్తంగా మనవిచేస్తా.

వారి వ్యాఖ్య :—

"హిందూదేశానికి స్వాతంత్ర్యం సంపాదించవలసిన బాధ్యతలో మహమ్మదీయులకు కూడా భాగం ఉంది. హిందువులు, మహమ్మదీయులు ఐకమత్యంగా ఉంటేనే కాని స్వాతంత్ర్యం సాధ్యంకాదు"

ఇది వారంగీకరించిందే కాన జవాబులేదు.

"ఈ ఐకమత్యాన్ని సాధించవలసిన బాధ్యత హిందు వులకు, మహమ్మదీయులకు సమానంగానే వుంది. కాని మనవాళ్లు మీస్నేహం మాకుకావాలంటు మహమ్మ దీయుల్ని బ్రతిమాలుతున్నారు. 'మీతో సఖ్యంగా వుంటె మాకేం హెచ్చుసౌకర్యాలు ఇస్తారంటూ బేర మాడుతున్నారు మహమ్మదీయులు.'

"ఇంతమాత్రమేనా"

"తాము కోరినవన్నీ మనవాళ్లు ఒప్పుకుంటోన్న కొద్దీ, మహమ్మదీయులు కొమ్మెక్కుతున్నారు."

దీనికి కొంచెం జవాబు :—

౧. "మీస్నేహం మాకు కావాలని కాదు. 'మీరు మేమూ స్నేహితులము, ఒకటే భారతదేశంలోని సిక్కు, క్రైస్తవ, మహమ్మదీయులంతా భారతీయులే: ఏకైక భారతప్రాతినిధ్యమే గాని, విభజన వద్దు, అది దేశాభ్యు దయానికి అత్యంతవిరోధం అని.

౨. "కోరినవన్నీ వొప్పుకుంటె, కొమ్మెక్కడమంటే; పరాధీన దేశంలో సహజంగా వుండే చీలికలను మరింత వృద్ధిచేయడానికి పరాయివారు సర్వవిధాల ప్రయత్నించ డం సహజం. తాత్కాలికమైనా, ప్రత్యక్షంగా హెచ్చు గా కనుపడే ఎరలకు లొంగిపోవడం మనకూ సహజమే. మనం మహమ్మదీయుల సంఖ్యలోనూ, వారు మన సంఖ్యలోనూ వుంటే, మనం కూడా ఇంతకన్న ఔదా ర్యం చూపించమేమో.

"ఇలా గాంధిగారి సాచివ్యం వచ్చాక, ఈమైత్రివిష యంలో మనవాళ్లుపూర్తిగా తప్పుదారి తొక్కడంవల్ల మనలో పురుషులే సంపూర్ణసహాయ సానుభూతులతో పనిచెయ్యలేకుండా ఉన్నారు. ఆస్థితిలో సంపూర్ణసహాయ సానుభూతులు చూపుతూ స్త్రీలేవిధంగా కృషిచెయ్యగ లరూ? అని.

అయితే గాంధిగారి సాచివ్యం పూర్తిగా తప్పుదారి అన్నమాట. సరేకాని పురుషులు తప్పుదారితొక్కక పోతే సంపూర్ణసహాయ సానుభూతులు చూపుతారా! ఇంకేముందిచూపడానికి! 'మైత్రి' అనేదితప్పుదారిఅయితే భేటీకీభేటీకి అంతే.ఇంకోమాట. పురుషులుచెయ్యలేకపోతే స్త్రీలుచెయ్యలేరు? ఏమి? అబలలా? ఓహో వీరికీవుందా ఈ స్వాభిమానం! ఓరుగంటిరాజ్యం వీరభోజ్యంగా పాలించిన ధీరసాధ్వీరుద్రమ్మను, ఉదయపూరురాణావాని అక్బరుచెరవిడిపించి, చిత్తోడ్దుర్గరక్ష, స్త్రీప్రతిభ, సాధ్వీతమొనర్చినరాణీ వీరాబాయి, మొదలైన అనేకచారిత్రక దృష్టాంతములట్లా ఉంచి, మొన్న మొన్నటి సత్యాగ్రహోద్యమంచూడరాదు? లక్షమంది పురుషులుజైళ్లకు వెళ్లినదానికంటె, వెయ్యిమందిస్త్రీలు వెడితే హడలెత్తిపోయిందిగవర్నమెంటు. వేలకువేలుపురుషులు లాటీలకు గురియైనదానికంటె, ఒక్కస్త్రీ లాటీదెబ్బతిన్నదంటే, విల్లింగడన్ హృదయంకూడా వెరగుపడిపోయింది. పికెటింగురోజుల్లోవెయ్యిమంది పురుషులు చేసినదానికంటె, నూరుమంది స్త్రీలపైస్వాంజయులుదేరిందంటే, తక, తక మసిపడ్డాయి సీమగుడ్డలకొట్లకిసీళ్లు. సన్నసూరుజైలులలో, దౌర్జన్యంగా, హృదయశూన్యంగా, లాఠీచార్జిజరిగినప్పుడు వారంరోజులు పురుషులు చేసిన ఉపవాసాలకి ఆలనా పాలనాలేదు. స్త్రీలందరు ఒక్కరోజు, ఒకరుమూడు రోజులు ఉపవాసం చేసేసరికల్లా సూపరింటెండెంటుతో సహా అంతా హాజరయ్యారు. అది స్త్రీలనైతికశక్తిగాని, స్త్రీలయెడ పురుషులకు కలనైతికభక్తిగాని, స్త్రీలుగట్టిగా పూనుకొంటే ఏపనికైనాఅమోఘంగా ఫలితం కలుగుతుంది. కంకుభట్టు రక్తపుచుక్క క్రిందపడకుండా సైరంధ్రి ఒక్కతే పైటకొంగు పట్టిందికాని, అది సైరంధ్రికే అయితే ఆమె రక్తబిందువు చిందకుండా, అశేష రాజ్యం తమసాగా గుడ్డల్ని పరిచేవారు భూమిమీద. స్త్రీలు కార్యదీక్షవహిస్తే ఆ సాధనాశక్తి అంత అద్భుతం. . అందుకే గాంధీగారు ప్రతివిషయానికీ స్త్రీలను హెచ్చరిస్తుంటారు. సరే! గాంధిగారిదే తప్పుదారిగా! వారిమాటేం లాభం?

"మనస్త్రీలు సాయపడితేనే గాని సాధ్యంకాక పోవడానికిది మన సంఘం ప్రవేశపెట్టవలసిన సంఘసంస్కరణమా! అని. సంఘంలో కాకపోతే దేశంలో. ఎక్కడైతే నేం? సంఘంకే గాని దేశానికి పనికిరాదా? స్త్రీలసేవ! దేశమంటే ఏమిటి: సంఘాలన్నిటి సంఘమే దేశం.

"ఉత్తరదేశంలో నేటికికూడా రోజురోజూ హిందూ స్త్రీలను చెరపడుతున్నవారి మైత్రి సంపాదించడానికి, ఆంధ్రస్త్రీలు సహాయసానుభూతులతో కృషి చెయ్యాలనడంలో ఔచిత్యంపమేనావుందా" అన్నిటికంటే ఇది మరీ అసభ్యంగా వ్రాశారు. ఎక్కడో ఉత్తరదేశంలో మహమ్మదీయులు చెరపడుతూంటే, దక్షిణదేశంలో ఇంకొకరు చెరపడతారు. దుర్మార్గులు ఎక్కడావుంటారు. ఒకసంఘంలోని కొందరు వ్యక్తులొకచోట దుర్మార్గం చేశారని ఆ సంఘంతోటి మైత్రి చెయ్యకూడదనడం, ఆసంఘాన్ని బహిష్కరించాలనడం, కేవలం అసభ్యం.

బ్రాహ్మణులు కొందరు అపకారం చేస్తే, బ్రాహ్మణులంతా బహిష్కృతులేనా! ఉద్యమం రోజుల్లో ఎవరో కొందరు సూపరింటెండెంట్లు జైళ్ళలోనూ, బైటా, కాంగ్రెసుసేవకులిని కొట్టించారంటె, ఇక ఆ పోలీసుశాఖకంతా శ్రీముఖమేనా! ఇటువంటి వ్రాతలు ఉన్న భేదాన్ని మరింత రేకొల్పి ఎన్నటికి, సామరస్యం, సౌమ్యం కుదరకుండా చెయ్యడానికి కలహబీజం వ్రేళ్లుపారి, వృద్ధి పొంది, విజృంభించడానికి కారణాలౌతాయి. ఆంధ్రాభిమానం ఎంతఎక్కువగా ఉంటె అంత మెచ్చుకోవచ్చును గాని, ఈవిధమైన పరాసహనం ప్రాజ్ఞులకు భావ్యంగాదు. మనం తలక్రిందుగా తపస్సుచేసినా మహమ్మదీయులు భారతదేశంలో ఉండవలసిందేగాని అడుగు కదపలేము. కావలిస్తే ఇంగ్లీషువారిని హిందూమహాసముద్రం దాటకుండా చెయ్యగలిగినా. అందుచేత హిందూమహమ్మదీయులకు ఐక్యతలేకపోతే దేశానికి ముక్తిలేదన్నమాటే. ఈవిషయం పెద్దవ్యాసం అనవసరం. సహేతుకంగా, సవిమర్శకంగా పెద్దలెందరో సెలవిస్తున్నారు.

"ఇక వారు సెలవిచ్చిన మిగతా తీర్మానాలు: వారసత్వ, విద్యాసంస్కరణ, ఘోషా, అస్పృశ్యత—ఇవి

ప్రవేశపెట్టలేదన్నారు సంపాదకులు. అక్కడి తీర్మానాల్లో ఎక్కువ ప్రాముఖ్యమిచ్చి మాట్లాడినదీ తీర్మానాల మీదనే: ఈ మాట్లాడిన ప్రతినిధురాండ్రే వ్రాతలుచూచి ఆశ్చర్యపడ్తారు. తీర్మానాలు సరిలయినాచూడాలి, పత్రికల్లో వివరంగా గమనించనైనా గమనించాలి. లేదా నాటి ఊరినుండి వచ్చిన ప్రతినిధురాండ్రనైనా అడిగి వివరాలు తెలిసికోవాలి. నిరాధారమైన వ్రాతలకి విలువ ఉండదని అందరికీ తెలిసినవిషయమే.

చివరకు ముగిస్తూ సంపాదకులు 'ఇదియేమి బాగా లేదు' అని మన్మదో ఆంధ్రరాష్ట్రీయమహిళాసభకు ఇది కేవలం అనవసరం, అనుచితమూ" అన్నారు. ఇది మరీనవ్వు పుట్టిస్తోంది. అమ్మదోసభకి అక్కరలేకపోతే, అసెంబ్లీ కిటి సభలకుగాని, తరువాతి సభలకుగాని కావాలా! ఆ మన్మదో మహిళాసభకు అనవసరం, అనుచితంకాదు, ప్రబుద్ధాంధ్ర సంపాదకులింత అసందర్భంగా వ్రాయడం కేవలం అనవసరమూ, అనుచితమూను.

పెద్దల్ని ఎదిరించడం విచారకరమైనా, న్యాయానికి గురువుతోనైనా పోట్లాడాలికదూ? యథార్థ వాదానికి క్షమాపణ అక్కర్లేదనుకుంటా.

నర్సాపురం } ఇట్లు
౧౦—౧—౩౬ } ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ

( శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు ఆతీర్మానానికి కర్తృత్వం వహించారేమో మాకు తెలవదు; కాని యెన్ని విధాల చూసినా, యిప్పటికీ యెప్పటికీ కూడా ఇలాంటి తీర్మానం చెయ్యడం తెనుగుస్త్రీలకు అనవసరమూ, అనుచితమూనూ అని చెప్పడానికేమీ సందేహం అక్కరలేదు. కాంగ్రెస్సువారిలోనే అనేకులు సోషలిస్టులుగా విడిపోయి గాంధిగారి సాచివ్యం అపాయకరంగా పరిణమించిందని తిరస్కరిస్తూ ఉన్నప్పుడు ఈసందర్భంలో మేము దిద్దుకోవలసింది ఏమీలేదు...... స్త్రీల శక్తిసామర్థ్యాలను మాకు చాలా విశదంగా ఉపదేశించారు లక్ష్మీబాయమ్మగారు. వారి అనుగ్రహానికి చాలా కృతజ్ఞులంగా ఉన్నాము; కాని అది ఉపదేశించ మాకు చెయ్యనక్కరలేదు. స్త్రీల శక్తిసామర్థ్యాలూ. వారివల్లనే దేశోన్నతి సాధ్యమవుతుందనీ మాకు బాగా తెలుసు. గాంధిగారి కాంగ్రెస్సు స్త్రీలను సరియైన దారిలో—సంఘసంస్కరణాలలో ప్రవేశపెట్టినట్లు మన వారికి యోగ్యము యిప్పటిలాగ నెత్తిలలు వేసిపుండకపోవును. అది అలా ఉండగా: లక్ష్మీబాయమ్మగారు ఆంధ్రుల రాజకీయాలలో స్త్రీల స్థానం యెంత లిగానుగా వుందో తెలుసుకొని ఉంటారనుకున్నాము; గాని అదేమీ కనపడడం లేదు. ఇప్పుడేనా వారు శ్రీమతి కనకమ్మగారి నడిగి, ఆవిషయాలు బాగా తెలుసుకుని స్త్రీల శక్తిసామర్థ్యాలను ఆంధ్రరాష్ట్రీయకాంగ్రెస్సుకమిటీవారికి బోధించ గోరుతున్నాము.......మాసంపాదకీయంలోని చాలా వాక్యాలకు లక్ష్మీబాయమ్మగారు పెడ అర్థాలు తీశారు. వాటికి అదే ధోరణిలో జవాబులు చెప్పడం మాకు సాధ్యం కాని పని. సంపాదకుడు)

## కుసుమ హర నాథ్ బాబా బూటకపు మతము

ఆంధ్రదేశంలో కుసుమహరనాథ్ బాబా భక్తులమంటూ కొందరున్నారు. హరనాథ్ ఏకాహాలనీ, అద్భుతాలనీ, పత్రికల్లో అప్పుడప్పుడు పడుతున్నాయి. హరనాథ్ (అంటేచచ్చిపోయిన ఒకఅసామీ) దేవుడని, చాలాఅద్భుతాలు చేస్తున్నాడని, భక్తులుపెట్టేపాలు, వెన్న, పళ్లు మొదలైనవి కనబడకుండా తినేస్తున్నాడనీ, కొందరు స్త్రీభక్తులను రోజులకొద్దీ అమాంతంగా మాయంచేసి మళ్లీమేరాత్రో అకస్మాత్తుగా యింట్లో ప్రవేశపెడుతున్నాడనీ, కొందరి స్తన్యం పానంచేస్తున్నాడనీ, కొందరితో అనేకహాసాలతో వినోదిస్తున్నాడనీ, హరనాథుని నమ్మితే ముక్తివస్తుందనీ హరనాథ్ భక్తులు ప్రచారం చేస్తున్నారు. తెలివిలేనివాళ్లను నమ్మిస్తున్నారు. ఇది దారుణమైన ప్రచారం. ఈమతం, బుద్ధిని హరించచేస్తుంది. ఎలాంటిమోసములైనా నమ్మేబలహీనతను కలిగిస్తుంది. ఇది మతంకాదు, మౌఢ్యం. దీనిని విమర్శించడం అవసరమనిపిస్తుంది. కాబట్టి హరనాథునిగురించీ, యీమతం

యొక్క పుట్టుకనుగురించీ, పెరుగుటనుగురించీ సంక్షిప్తంగా వ్రాస్తాను.

హరనాథ్ చచ్చిపోయి యిప్పటికి యేడెనిమిదేళ్లవుతుంది. ఈయన బెంగాల్ దేశస్థుడు. ఎఫ్. ఏ. వరకూ చదువుకొన్నాడు. చిన్నప్పుడే పెళ్లయింది. శ్రీనగరంలో చిన్న ఉద్యోగం సంపాదించుకొన్నాడు. అందరిగృహస్థుల్లాగే సుఖంగా కాపురము చేసుకున్నాడు. బిడ్డలనుకూడ కనుకున్నాడు. ముసలాడుఅయ్యేదాకా కొలువుకొలిచేడు. పెన్షన్ పుచ్చుకొన్నాడు. స్వగ్రామంచేరి ఆలుబిడ్డలతో సుఖంగా కాలక్షేపంచేసాడు. తుదకు కాలధర్మం పొందాడు. ఇది యీయన బాహ్యజీవితచరిత్ర సంక్షిప్తంగా. దీనినిబట్టి ఈయన భగవంతుని అవతారమనటానికి కానీ, కనీసం ఆఖరుకు ఆధ్యాత్మికాకాంక్షయైనా కలవాడనటానికి ఏవిధమైన ఆధారాలూ కనబడవు.

ఈయన వ్రాసిన ఉత్తరాలు ఒకపుస్తకంగా కూర్చి అచ్చువేయించారు ఈయన శిష్యులు. దానికిపాగల్ హరనాథ్ అని పేరుపెట్టారు. అదేవీరి మతానికిమూలగ్రంథం. ఆపుస్తకంచదివితే హరనాథ్ ఉద్దేశాలూ ఆయనఆధ్యాత్మికం తెలుస్తాయి. నేను ఆపుస్తకం విచక్షణతోచదివి, ఆధ్యాత్మికవిషయంలో హరనాథ్ అక్షరాలతరగతి అయినాదాటలేదని గ్రహించి ఈవిమర్శ వ్రాస్తున్నాను.

సామాన్యంగాచిన్నతనంలో భక్తిగురించీ, భగవత్సాక్షాత్కారముగురించీ, మతగ్రంథాలు చదువుతూవుంటే పిచ్చిపిచ్చి ఊహలుపుడతాయి హిందువుడై పుట్టినకుర్రాడికి. తానొకమహాభక్తుడనై పోవాలనుకుంటాడు. వాని స్వభావంలో మెత్తతనం కూడా ఉంటే ఇక చెప్పనక్కరలేదు ఆఊహల ఉద్రేకం. మర్నాటినుంచే మహోగ్ర తపస్సు చేయాలని తయారవుతాడు. ఏ వుద్యోగమో దొరికితే ఆ ఆరంభశూరత్వం కొద్దిరోజులలోనే తగ్గిపోతుంది. దొరక్కపోతే మరినాలుగురోజు లుంటుంది. అది నిజమైన భక్తీకాదు, వైరాగ్యమూకాదు. పేరాసవల్ల కలిగిన పిచ్చిఊహ.

హరనాథ్ కూడా చిన్నతనంలో ఉద్యోగం దొరకనప్పుడు ఈలాంటి పేరాసతో కొంచం బాధపడ్డాడు. చైతన్యమతగ్రంథాలు చదువడంవల్ల కృష్ణుడు, గోపికలు, రాధ, బృందావనం, రాసలీల యీలాటివాటియెడల అనురక్తికలిగింది. భక్తిసాధించాలని ఆశపడ్డాడు. కాని అంతలో ఉద్యోగం దొరికింది. ఇదెందు కొచ్చిందిరా అనుకుంటూ అయిష్టంతోనే ఉద్యోగంలో ప్రవేశించాడు. ఉద్యోగం కాశ్మీరదేశంలో. ఆదేశం భూలోకనందనవనం. అచ్చట ప్రకృతిమనోహరమైనది. హరనాథునకు ప్రత్యక్షబృందావనమే. ఆరమణీయత కొన్నాళ్ళతని భక్త్యుత్సాహానికి సహాయపడింది కాని పురాణవైరాగ్యమెన్నాళ్లుంటుంది? చప్పున సన్నగిలిపోయింది. సాధించలేకపోయినాననే కించమాత్రం మిగిలింది. ఇంతే ఈయన ఆధ్యాత్మికసాధనా, అనుభవమున్నూ. ఆధ్యాత్మికంలో ఈయన అక్షరాల తరగతి అయినా దాటలేదంటే అది యెంతమాత్రం సత్యదూరమైనమాటకాదు.

ఇక, ఈయన అవతారమనే పుకారు ఏలాపుట్టిందో వివరిస్తాను. అతలవిహారినంది అనే బుకింగ్ క్లార్కు ఒకాయన ఉండేవాడు. ఆయనొక మెట్టవేదాంతి. హరనాథ్ కాశ్మీరం పోవడం, రావడంలో ఏలాగో రైలుస్టేషనులో పరిచయమైంది ఆయనకూ ఈయనకూ. భక్తిమార్గగోష్ఠి ఉత్తరప్రత్యుత్తరాల్లో నడుస్తూఉండేది యిద్దరికీ మధ్యా. కొన్నిసంవత్సరాలు కాశ్మీరంలో ఉండి, స్వదేశమునకు వస్తూ ఒకనాడు హరనాథ్ అతల విహారికి కనబడ్డాడు. హరనాథ్ శరీరచ్ఛాయపూర్వం కంటె కొంచం తెల్లబడి ఉందట. బంకూరాజిల్లావాడు పోయి కాశ్మీరంలో అనేకసంవత్సరాలు ఉంటే తెల్లబడవచ్చు. ఆశ్చర్యమేమీ లేదు. కాని అతలవిహారికి ఆశ్చర్యం కలిగింది. ఆనూర్పు కొక చిత్రమైనకారణం వ్రాసి అచ్చువేయించాడు. ఆకారణం యేమిటంటే గౌరాంగదేవుడు (చైతన్యుడు) హరనాథ్ లో దూరాడట అందువల్ల హరనాథ్ శరీరముకు గౌరవర్ణం కలిగిందట. ఆయన మొదలుపెట్టాడు హరనాథ్ గౌరాంగదేవుడని ప్రచారం. ఆప్రచారంవల్ల పుట్టుకొచ్చారు హరనాథ్ భక్తులు.

హరనాథ్ శరీరం తెల్లబడ్డానికి అతనిలో గౌరాంగదేవుడు ప్రవేశించడమే కారణమైతే, నవుకరీచాలించి

స్వదేశం వచ్చిన తర్వాత ఎప్పటిలాగే మళ్లీ హరనాథ్ నల్లబడ్డాడుకదా దానికి కారణమేమిటి? అప్పుడు గౌరాంగదేవుడు హరనాథ్‌లో దూరాడనేది శుద్ధఅబద్ధం. హరనాథ్ జీవితమే చాలినంత తార్కాణం దానికి. గౌరాంగదేవుడు ప్రవేశించేడన్న తరువాతకూడా హరినాథ్ జీవితవిధానంలో నేవిధమైన మార్పూ కలుగలేదు. పాత రస్తాలోనే నడిచింది అంతా. గౌరాంగదేవు డాలాంటి జీవితాన్ని గడిపాడనటం అసంగతమైన విషయం.

తన్ను గౌరాంగ దేవుడనిచేసే అసత్యప్రచారం హరినాథుకు చిక్కుగా ఉండేది. అవునటానికీ యిష్టముండేది కాదు. కాదనటానికి యిష్టముండేదికాదు. అయినా చెప్పవలసి వచ్చినప్పుడు కాదన్నట్టే చెప్పాడు చాలాకాలం. కాని భక్తులతని మాటలు నమ్మేవారు కారు. అవి దొంగ మాటలనేవారు. తమభక్తిని పరీక్షించడంకోసం అలా నాటకమాడుతున్నాడనేవారు. చివరకాయన ఒకవిధంగా భావించుకొని ఆ అసత్యప్రచారములగురించి మనస్సును సమాధానపర్చుకున్నాడు. ఆవిధమేమిటంటే “ రాతివిగ్రహాన్ని భగవంతుడని పూజించేవారికి ముక్తి వస్తుందిగదా. మానవుడైన నన్ను పూజిస్తే ఎందుకురాదు? కాబట్టి ఇదీ ఒక ముక్తిమార్గమే” అని, ఆవిధంగా అంతరాత్మను సమాధానపర్చుకొని, తానుగౌరాంగుడే అన్నట్టుకొద్దిగా నాటకమాడాడు తనజీవితంయొక్క చివరభాగంలో.

ఇది ఈ మతంయొక్క పూర్వవృత్తాంతం. పాగల్ హరనాథ్ దగ్గిరా పుస్తకాలు పరిశీలనదృష్టితో చదివేప్రతివారికి యీవిషయాలు విశదమౌతాయి. కొందరుబెంగాలీలు ఈబూటకపు దేవుణ్ణి గుడ్డిగానమ్మేరు. మనఆంధ్రదేశంలో కొంతమందికికూడా ఈ దేవుడుమీద భక్తి కుదిరింది. వారునమ్మడంచాలక ఇతరులకుకూడా ప్రచారం చేస్తున్నారు. నీరు హరనాథ్ దేవుడికి ఆరోపించేఅద్భుతాలు వగైరా అతి హాస్యాస్పదంగా ఉన్నాయి. స్త్రీలను రోజుల కొద్దీ మాయంచేసి మళ్లీ తీసుకొచ్చే దేవుణ్ణి నమ్మే ముందు బాగా ఆలోచించవలసిఉంటుంది. మతంపేరుతో వస్తే చాలు యెలాంటివిషయాన్ని అయినా నమ్మేబలహీనత హిందువులలో కొందరికిఉంది. చదువుకున్న వారిలో కూడా ఆబలహీనత కనబడుతుంది. ఆబలహీనతకు లొంగి విచక్షణ ఉపయోగించకుండా నమ్మేవారిని హెచ్చరించడంకోసం ఇది వ్రాసాను.

—మిత్తిపాటి అప్పన్న

(శ్రీయుతులు మిత్తిపాటి అప్పన్నగారిని మేము చాలా చాలా ప్రశంసిస్తున్నాము; అయితే: ఆంధ్రదేశం, అప్పన్నగారివంటి యథార్థవాదులను గుర్తించే స్థితిలో లేదు. కాని హరనాథభక్తులు మాత్రం వారిని పూర్తిగా నిందిస్తారు. సందేహం లేదు. అయినా, అప్పన్నగారు చలించరని నమ్ముతున్నాము...............బమ్మెర పోతన్న, త్యాగయ్య, రామదాసు, తరిగొండ వెంకమ్మ, విమల ప్రకాశం మొదలయిన మహాభక్తులూ, జ్ఞానులూ కల తెనుగుజాతి, ఇవాళ, వారిని సరిగా స్మరించడం కూడా యెరగక ఇలాంటి పిచ్చి నమ్మకాలతోనూ, అప్రస్తుత — అనవసరప్రసంగాలతోనూ ఉక్కిరిబిక్కిరి అయిపోతూ వుండడం చాలా శోచనీయమైన విషయం. హరనాథుని గురించిన యీపిచ్చినమ్మకంతో అస్తవ్యస్తమయిపోడమే కాకుండా మనవారు మన దేశంలో మన డబ్బుతో చైతన్యమఠాలు కట్టించేస్తున్నారు. భక్తిపారమ్యం పొందడమే కాకుండా సంగీతశాస్త్రం కూడా ఉద్ధరించిన త్యాగయ్య, నిజంగా, మహారాష్ట్రంలో గాని, బంగాళాలో గాని, చివరికి తమిళనాడులో గాని పుట్టివుంటే యీపాటికి ప్రపంచాతీతుడుగా పూజించబడుతూ ఉండును. మనవారు, నందనారంటే చూపించే ఉత్సాహంలో సహస్రాంశమైనా రామదాసంటే చూపించడం లేదు. నేటి ఆంధ్రమహాపురుషులవిషయంలో కూడా మన వారి ప్రవృత్తి యిలాగే ఉంది. ఇరుగుపొరుగు వారికి తీసిపోని స్వజాతీయమహాపురుషులను ఇతరదేశాలవారితో నేనా సమంగా పూజించని మనవారు, భక్తిప్రదర్శనాలు చేస్తున్నారంటే అది ఆంధ్రజాతిలో గడ్డకట్టిఉన్న భావదాస్యానికి అచంచల మయిన నిదర్శనం కాక మరేమిటి?

సంపాదకుడు).

* * *

# వ్యావహారిక భాష రచించిన వారిపేళ్లు



సాహితి, ప్రబుద్ధాంధ్ర, శారద, గ్రంథాలయ సర్వస్వము భారతి, భరతమాత, పుష్కరిణి, సరస్వతి, ప్రారంభవిద్య, తెనుగుదేశ వాఙ్మయపత్రిక, శెట్టిబలిజ, గుంటూరుపత్రిక, కృష్ణాపత్రిక, త్రిలింగ, ఆంధ్రపత్రిక మొదలయిన అనేక పత్రికలలో వ్యావహారిక భాషను వ్రాస్తూ ఉన్నవారు అనేకులు ఉన్నారు. వారిలో కొందరి పేళ్లిమాత్రమే ఈ పట్టికలో ఉన్నవి. ఈ పట్టిక ౧౯౨౫ వ సంవత్సరములో మహారాజశ్రీ రావుసాహేబు గిడుగు వెంకటరామమూర్తిపంతులుగారి కోరిక ననుసరించి తయారుచేసినాను. ఇటీవల వారు కొన్ని పేళ్లిందులో స్వయముగా చేర్చినారు.

౧౯౨౫ వ సంవత్సరము తరువాత ముద్రితములయిన వివిధపత్రికలలో ఇంకు చేరనివారెందరో తమ వ్యాసములు ప్రకటించినారు. అట్టివారిపేళ్లుకూర్చి ఇంకొక పట్టిక దీనికి అనుబంధముగా ప్రకటించ వలచినాను. పత్రికాధిపతులూ వివిధభాషాసారస్వత సమాజముల సభ్యులూ తమకు తెలిసినపేళ్లు పంపుదురుగాక అని కోరుతున్నాను.

౧౯౩౬ వ సంవత్సరము ఏప్రిల్ నెలలో జరుగబోయే నవ్యసాహిత్య రజతోత్సవమునకు ఈపట్టికలో చేరినవారి కందరికీ ఆహ్వానములు పంపి వారిని సభలకు దయచేయవలసినదని కోరదలచినాము. గడచిన ౨౫ సంవత్సరములలోనూ నవ్యసాహిత్యసృష్టి వ్యావహారిక భాషాపునః ప్రతిష్ఠాపనమూ ఎంతవరకు కొనసాగినవో మదింపుచేయడానికీ భాషావాఙ్మయముల చరిత్ర రచించడానికీ ఈపట్టిక సాధ్యమయినంత సంపూర్ణముగా ఉండడము అవశ్యకము గనుక మా ఉద్యమమునకు తోడ్పడి తమకు తెలిసినపేళ్లు (ఆయారచయితల రచనలలో ఒకటి రెండు పేర్లు కూని) పంపుదురుగాక అని భాషాభిమానులను ప్రార్థిస్తున్నాము.

గుంటూరు,
౩౧—౧౨—౩౫.

తె. వెంకటరత్నం
నవ్య సాహిత్య పరిషత్తు

అంజయ్య-పాతూరి
అద్వైతబ్రహ్మశాస్త్రి-వావిలాల
అనంతరామమూర్తి-గాదేపల్లి
అప్పయ్య-అయ్యవారి, పెరిదేపి తెనాలి
అప్పలనరసింహం-దేవులపల్లి
అప్పారావు-గురజాడ
అప్పారావు-పాటిబండ
అప్పారావు-బసవరాజు
అప్పలస్వామి-పురిపండా
అయ్యంభొట్లు-గుడిపల్లి, నరసారావుపేట
అయోధ్యరామయ్య-బొండపల్లి
అల్లూరయ్యగుప్త-మట్లూ
అవధాని-మల్లాది
అక్షయలింగం-గున్నేపల్లి
ఆంజనేయచౌదరి-గారపాటి
ఆంజనేయశర్మ-కొడాలి, బెజవాడ
ఆంజనేయులు-పాలపర్తి, బందరు
ఆచార్య S. G.
ఆదినారాయణశాస్త్రి-పంచాగ్నుల
ఆదిశేషయ్య-కొట్రు
ఉమర్ అలీషా-పిఠాపురం
ఉమాకాన్తం-అక్కిరాజు
కనకమ్మ-బెల్లంకొండ
కన్నయ్య-కధల
కమలాదేవి-వేదాంతం
కమలావతీదేవి-పులవర్తి
కామేశ్వరరావు-టేకుమళ్ల
కామేశ్వరరావు-భమిడిపాటి
కామేశ్వరరావు-శ్రీపాద, రాజమండ్రి
కామేశ్వరరావు-జనమంచి
కాళిదాసు-వఝ్ఝల
కాశీశ్వరరావు-అయ్యదేవర
కుటుంబరావు-కొడవటిగంటి
కుమారస్వామి-కూచి
కుమారస్వామి-దావులూరి, గుడివాడ
కృష్ణమాచార్యులు C. R.
కృష్ణమాచార్యులు-కపిసలం
కృష్ణమూర్తి-కామరాజు
కృష్ణమూర్తి-తెలికిచర్ల
కృష్ణమూర్తి-దంటు
కృష్ణమూర్తి-కొడవటిగంటి
కృష్ణశాస్త్రి-దేవులపల్లి
కృష్ణారావు-మానూరి
కృష్ణారెడ్డి-రావులచెరువు
కేశవాచార్యులు-న్యాయాయనం
కోటయ్య-నూరపరాజు
కోటీశ్వరమ్మ-మంథా
కోదండరామరెడ్డి-మరుపూరి
గంగన్న-జయంతి
గంగరాజు-కలిదిండి, తాడేపల్లిగూడెం
గణపతిశాస్త్రి-పిలకా
గోపాలకృష్ణమూర్తి-భాస్కర్ల
గోపాలకృష్ణమూర్తి-రాళ్లపల్లి
గోపాలకృష్ణయ్య-అడుసుమిల్లి

గోపాలకృష్ణయ్య—దుగ్గిరాల
గోపీనాథం—చదలవాడ
గోవిందరాజాచార్—వింజమూరి
గోవిందరాజు—కందిరాజు
చంద్రమౌళీశ్వరయ్య—చిట్టా
చలమయ్య—చిన్నం
చిదంబరం—పూండ్ల, బాపట్ల
చిదంబరయ్య—ఘుడియారం, జమ్మలమడుగు
చిన్నస్వామి—V. S.
చెన్నకృష్ణారెడ్డి—V.
జగన్నాథం—యల్లాపంతుల
జగన్నాథము—గిరిమెళ్ల
జగన్నాథము—దల్లా
జగన్నాథరావు—గాడిశెట్టి, పాలకొల్లు
జగన్నాథస్వామి—పారినంది
జనార్దనరావు—మాదిరాజు
జనార్దనరావు—కొంపెల్ల
జోగిసోమయాజులు—శ్రీపాద
తిరుపతిరాజుపంతులు—అయ్యగారి
తిరుమలనరసింహాచార్యులు—బుక్కపట్టణం
దశరథరామయ్య—వెంగవేటి, బెజవాడ
దీక్షితులు—చింతా
దత్తయ్య—కొాజ, నాదరేవు
దుర్గానాగేశ్వరరావు—వేమూరి
దొరయ్య—నెక్కంటి
ధర్మారావుకవి—కొల్లూరి
నరసింగరావు—గాదె
నరసింహరావు—B.
నరసింహం—కొత్తపల్లి
నరసింహశాస్త్రి—నోరి
నరసింహశాస్త్రి—మొక్కపాటి
నరసింహాచార్యులు—K.
నరసింహారావు—మునిమాణిక్యం
నాగభూషణ్—ముట్నూరి
నాగభూషణం—వెంపటి
నాగమణిదేవి—గుడిసేవ
నాగేంద్రరావు—పింగళి
నాగేశ్వరరావు—పేరాల
నాగేశ్వరరావు—మొవ్వ
నాగేశ్వరశర్మ—ఇంద్రగంటి
నాయనశాస్త్రి—టంగుటూరి
నారాయణ—K. H. V. S. Madras.
నారాయణమూర్తి—కొప్పర్తి
నారాయణమూర్తి—పాలూరి.
నారాయణరావు—చిలుకూరి
నారాయణమూర్తి—భోగరాజు
నారాయణరెడ్డి—తోపుదుర్తి
నిత్యానందశాస్త్రి—అక్కిరాజు
నీలవేణమ్మ—ఆకాశం
నృసింహావధానులు—మద్దూరి
పట్టాభిరామయ్య—B.
పట్టాభిరామయ్య—ధమిడిపాటి
పట్టాభిరామాచార్యులు—మద్దిపాటి, వూళ్ళపాలెం Kistna
పాపయ్యశాస్త్రి—బులుసు
పాపారావు—గోనెవర్తి
పార్థసారథి—వింజమూరి
పార్థసారథి—వేమూరి
పార్వతీశం—వంకెద్దు
పార్వతీశం—శిష్టా
పార్వతీశ్వరశాస్త్రి—మండపాక
పిచ్చిరెడ్డి—నుసుమూరి
పేర్రాజు—తోలేటి
పేర్రాజు—మల్యాల
పోలిరెడ్డి—వేమురెడ్డి
ప్రకాశం—టంగుటూరి
ప్రభాకరశాస్త్రి—వేటూరి
బంగారయ్య—నందూరి
బాపినీడు—మాగంటి
బాపిరాజు—అడివి
బాబూరావు—వజ్ఝ
బాలకృష్ణశాస్త్రి—పిల్లలమర్రి
బాలాజీదాసు—కొండూరి
భావనారాయణ—పాలపర్తి
భాస్కరమ్మ—అనుత్తి
భాస్కరరావు—కొకర్లమూడి
భీమశంకరం—చింతా
మంగయ్య—నల్లగొంపె
మల్లికార్జునరావు—పందిరి
మాధవరామశర్మ—జమ్ములమడక
మారయ్య—గుబ్బల
ముద్దుకృష్ణ—సామినేని
యామినీపూర్ణతిలకమ్మ

రంగనాయకులు–గోగినేని
రంగాచార్యులు–D. H. V.
రంగారావు–మాకేటి
రంగారావు–వల్లూరి
రంగారెడ్డి–M.
రాఘవరావు–బెల్లంకొండ
రాజలింగమూర్తి–పెద్దాడ
రాజేశ్వరరావు–తుర్లపాటి
రాజ్యలక్ష్మీదేవి
రాధాకృష్ణరెడ్డి
రామకృష్ణరావు–అబ్బూరి
రామకృష్ణరావు–బొగ్గవరం
రామకృష్ణశాస్త్రి–మల్లాది
రామకోటేశ్వరరావు–కోలవెన్ను
రామచంద్రప్రసాదరావు–రొయ్యూరు
రామచంద్రయ్య–సాణంగిపల్లి
రామచంద్రయ్య–బుర్రం, రావూరు
రామచంద్రయ్య–రాళ్లబండి
రామచంద్రయ్యశర్మ–పుల్లాపంతుల
రామచంద్రరావు–తుంపర్తి
రామచంద్రరావు–ధరణి
రామచంద్రాచార్య–B. V.
రామచంద్రశాస్త్రి–మారేపల్లి
రామదాసు–గొడవర్తి
రామదాసు–దేశరాజు
రామదాసుపంతులు–వేమవరపు
రామన్నపంతులు–లింగం
రామబ్రహ్మం–పాతపాటి
రామబ్రహ్మం–పోలవరపు, రేపల్లె
రామమంత్రి–విద్యాశేఖరీయులు
రామమూర్తి–గరికిపాటి
రామమూర్తి–వరద
రామమూర్తినాయుడు–బండారు
రామమూర్తిశాస్త్రి–శ్రీపాద
రామయ్య–వుంటకూరి
రామలింగారెడ్డి–కట్టమంచి
రామలింగేశ్వరరెడ్డి–కోనా
రామలింగేశ్వరుడు–పెమ్మరాజు
రామశేషయ్యచౌదరి–నూతక్కి
రామసోమయాజులు–భమిడిపాటి
రామానుజాచార్యులు–కలచవీడు
రామారావు–యద్దనపూడి
రామేశంపంతులు–వేపా
రామేశ్వరరావు–గార్లపాటి
లక్ష్మణరావు–కోనూరి
లక్ష్మణస్వామి–O. Anantapur
లక్ష్మీకాంతమ్మ ఊటుకూరు
లక్ష్మీనరసింహం చెట్టి
లక్ష్మీనరసింహశర్మ మున్నంగి
లక్ష్మీనరసింహమూర్తి యామజాల
లక్ష్మీనరసింహారావు అరికపల్లి
లక్ష్మీనారాయణ వున్నవ
లక్ష్మీనారాయణ పెమ్మరాజు
లక్ష్మీపతి పెమ్మరాజు
లక్ష్మీబాయమ్మ ద్రోణంరాజు
వరలక్ష్మమ్మ కనుపర్తి
వరదారెడ్డి B.
వాసుదేవరావు అక్కిరాజు
వాసుదేవరావు శ్రీ
వాసుదేవశెట్టి కట్ట
విశ్వనాథం చేబ్రోలు
విశ్వనాథం రేకపల్లి
విశ్వనాథశర్మ వేమూరి
విశ్వనాథశర్మ మల్లాది
విశ్వేశ్వరుడు Y.
వీరన్న రాజవరపు, వద్దిపర్రు
వీరయ్య–పెద్దిభొట్ల
వీరరాఘవస్వామి–త్రిపురారిభట్ల
వీరరాఘవస్వామి–వెలువలి
వీరేశ్వరచౌదరి–మంద్రు
వుయ్యాసు–జమీందారు
వెంకటకృష్ణయ్య P.
వెంకటకృష్ణారావు–జయంతి
వెంకటకృష్ణారావు–భావరాజు
వెంకటనరసప్ప K. Madanapalli
వెంకటనరసింహం–సాగి
వెంకటనరసింహం–నూరి
వెంకటనారాయణ–వంగల
వెంకటనృసింహం–అనమరాజు
వెంకటప్పయ్య–కొండుకూరి, భీమవరం
వెంకటప్పలాచార్యులు N.
వెంకటప్పారావు–కవిపురపు

వెంకటరంగయ్య-కోరంశెట్టి
వెంకటరంగయ్య-మామిడిపూడి
వెంకటరంగారావు-కొమర్రాజు
వెంకటరత్నం-తెలికిచర్ల
వెంకటరత్నం-నరహరిసెట్టి
వెంకటరత్నం-పత్తి
వెంకటరత్నం యద్దనపూడి
వెంకటరత్నం వెలగపూడి
వెంకటరత్నశర్మ విన్నకోట
వెంకటరమణ కొండి
వెంకటరమణయ్య కర్రి
వెంకటరమణయ్య పూడిపెద్ది
వెంకటరమణయ్య K.
వెంకటరమణయ్య కొల్లి
వెంకటరమణయ్య గ్రంధి, అనకాపల్లి
వెంకటరమణయ్య రాయసం
వెంకటరమణయ్యరాజు శ్రీరాజాకాకర్లపూడి
వెంకటరామారావు కొమర్రాజు
వెంకటరామశాస్త్రి దువ్వూరి
వెంకటరమణాచార్యులు దూపాటి
వెంకటరామమూర్తి సోమయాజుల
వెంకటరామమూర్తిపంతులు గిడుగు
వెంకటరామయ్య తురగా
వెంకటరాయసాంఖ్యాయనశర్మ ఆచంట
వెంకటరావు కవికొండల
వెంకట్రావు నిడదవోలు
వెంకటరావునాయుడు P.
వెంకటశర్మ మంగిపూడి
వెంకటశేషాచార్యులు కిళాంబి
వెంకటశ్రీరాములు చింతలపాటి
వెంకటసుబ్బయ్య కొండవటిగంటి
వెంకటసుబ్బయ్య చింతలపాటి
వెంకటసుబ్బయ్య ప్రభల
వెంకటసుబ్బారావు కొడాలి
వెంకటసుబ్బారావు నంపూరి
వెంకటసుబ్బారావు పోతాప్రగడ
వెంకటసుబ్బారావు యడ్లపాటి
వెంకటసుబ్రహ్మణ్యం తాండ్ర
వెంకటహనుమయ్య కంచెర్ల
వెంకటాచలం గుడిపాటి
వెంకటాచలపతి నేతి
వెంకటాద్రి దుర్భా

వెంకటారెడ్డి కామిని
వెంకన్న పాల
వెంకయ్య చుట్టిగళ్ల
వెంకయ్యచౌదరి గుత్తా
వెంకటేశ్వరరావు కుందేరు
వెంకటేశ్వరరావు నార్ల
వెంకోజీరావు టేకమళ్ల
వెంకటశేషేశ్వరుడు వాజపేయాజుల
వైకుంఠం తూములూరి
శంకరరావు కోవెల
శంకరరావు మంచికలపాటి
శివయోగానందరావు కొమర్రాజుగడ్డ
శివయ్య అంకె
శివరామకృష్ణయ్య మద్దూరి
శివరామకృష్ణారావు కొడాలి
శివరామమూర్తి దుగ్గిరాల
శివరామశాస్త్రి వేలూరి
శివశంకరశాస్త్రి తల్లావఝ్ఝల
శేషగిరిరావు ఆండ్ర
శేషగిరిరావు బుర్రా
శేషయ్య జాస్తి
శేషాద్రిశాస్త్రి (శేషాద్రిరమణ కవులు)
శ్రీకంఠం పునుగు
శ్రీదుర్గాసదాశివేశ్వరప్రసాదబహద్దరుగారు వాసిరెడ్డి
శ్రీనివాసమ్మ కాశీసోమయాజుల
శ్రీనివాసరావు చిల్లరిగె
శ్రీనివాసశిరోమణి కరణం
శ్రీనివాసాచార్యులు ముడుంబ
శ్రీపరమహంససత్యవ్రతానందసరస్వతీస్వాములవారు మూలపేట,
నెల్లూరు
శ్రీరామనృసింహం సుసర్ల
శ్రీరామమూర్తి మల్లెల
శ్రీరామశాస్త్రి మద్దూరి
శ్రీరాములు కొండముది
శ్రీరాములు చిలుకూరి
శ్రీరాములు బుద్ధిరాజు
సంజీవరాయణింగారు సూర్యదేవర, దుగ్గిరాల
సత్యనారాయణ గండికోట
సత్యనారాయణ చెంగల్వాల, పాలకొల్లు
సత్యనారాయణ నరసింహదేవర
సత్యనారాయణ భమిడిపాటి
సత్యనారాయణ విశ్వనాథ

సత్యనారాయణ Ch.
సత్యనారాయణ గరిమెళ్ల
సత్యనారాయణమూర్తి నిడమర్తి
సత్యనారాయణమూర్తి వాడ్రేవు
సత్యనారాయణరాజు పెనుమత్స
సత్యనారాయణరావు కొండాలి
సత్యనారాయణరావు చెంగల్వల
సత్యవతీదేవి అచంట
సయ్యద్ యూసఫ్ చౌదరి
సాంబయ్య జంపాల
సీతాపతి గిడుగు
సీతాబాయి బొడ్డపాటి
సీతారామయ్య కర్రా
సీతారామయ్య కురుగంటి
సీతారామయ్య పునుగు
సీతారామయ్య యేటుకూరి
సీతారామయ్య వేంపాటి
సీతారామశాస్త్రి గొల్లపూడి
సీతారామస్వామి దేవరాజు
సుందరం G. S.
సుందరరామమూర్తి కాశీసోమయాజుల
సుందరరామయ్య ఆకొండిఝల
సుదర్శనమ్మ ఎక్కిరాలవరపు
సుబ్బరామయ్య గిన్నవరపు
సుబ్బరామిరెడ్డి ఇంటుపూడి
సుబ్బరామశాస్త్రి H.
సుబ్బారాయుడు ఆన్నాప్రగడ, వినుకొండ
సుబ్బారావు అచంట
సుబ్బారావు కొమ్మవరపు
సుబ్బారావు గోకవరపు
సుబ్బారావు నాయని
సుబ్బారావు పట్నా, తాడేపల్లిగూడెం
సుబ్బారావు P.
సుబ్బారావు రాయప్రోలు
సుబ్బారావు V., రామచంద్రపురం
సుబ్బారావు వంగూరి
సుబ్బారావు లక్కరాజు
సుబ్బారావు శనివారపు
సుబ్బారావు శిష్ల
సుబ్బారావునాయుడు N.
సుబ్రహ్మణ్యశాస్త్రి మహాభాష్యం
సుబ్రహ్మణ్యశాస్త్రి శ్రీపాద
సుబ్రహ్మణ్యశాస్త్రి సుసర్ల
సుబ్రహ్మణ్యసిద్ధాంతి పిసిపర్తి
సూరిశాస్త్రి పురాణం
సూర్యప్రకాశరావు మగ్గిరాల
సూర్యప్రకాశరావు సహదేవ
సూర్యనారాయణ కిడుపూడి
సూర్యనారాయణమూర్తి మువ్వారి
సూర్యనారాయణమూర్తి దేవులపల్లి, కొత్తపేట
సూర్యనారాయణరావు అద్దంకొర్ల
సూర్యనారాయణరావు తల్లాప్రగడ
సూర్యనారాయణరావు పాటి
సూర్యనారాయణశర్మ గాడేపల్లి
సూర్యనారాయణశాస్త్రి వాసా
సోమన్న మల్లాది
సోమయ్య చేబియ్యం
సోమశేఖరశర్మ మల్లంపల్లి
హనుమచ్ఛాస్త్రి ఇంద్రకంటి
హనుమంతరావు అపురూపాది
హనుమంతరావు కొమ్మూరి
హనుమంతరావు దినకర
హనుమంతరావు భోగిరాజు
హరిసర్వోత్తమరావు గాడిచర్ల

---

# ప్రశంస

"మహాశయా, మీ పత్రిక ఆంధ్రభాషకు నిజమైన సేవ చేస్తున్నదంటే ముఖస్తుతి మాటగా తలపరాదు. ఇప్పుడు వెలువడుచున్న చిత్తకార్తె పత్రికలవలె బొమ్మల సరుకుతో నింపి (అందులో బ్రహ్మం గారి చిత్రాలు నింపితే శ్రమ జాస్తి, లోపల ఏమీ సరుకు లేకపోయినా) పాఠకులను భ్రమింపజేస్తున్నట్లు గాక: ఉత్తముని జీవితం వలె మీ పత్రికది నిరాడంబరమైన జీవితం. ఉత్తముని భావంవలెనే మీ పత్రిక భాషం నిర్మలమైనది అని అనక తప్పదు.

మీ పత్రికకు కొందిమంది చందాదారులను చేర్చి ఏదో ఉడుతాభక్తిగా భాషకు సేవ చేద్దామనే తలంపు ఉన్నది. ఈరోజుల్లో డంబరహితమైన మీపత్రిక యెవరికి కావలయును? బొమ్మలు లేని పత్రికను చదివే వారు! అని కొంత సందేహం ఉన్నది.

అయితే: ఏ పత్రిక ఎలా నడుస్తున్నా మంచిని మంచి, చెడ్డను చెడ్డ అనుకుంటారు. మీ పత్రిక నడకలో అర్థం వున్నది. అందువల్ల మీ పత్రికకు మంచి విలువ ఉన్నది. వార్షిక సంచిక ప్రకటించటం సంతోషకరమైన విషయం.

పత్రికను నిర్విఘ్నంగా నడిపి కథలింకా ఘాటుగా వ్రాసి సంఘాన్ని భాషను ఇంత ఉద్ధరిస్తారనే ఆశ ఉన్నది. సెలవు.

ఇట్లు,

మంగళగిరి అండే నారాయణస్వామి

# "నవ్యసాహిత్య" పరిషత్తు-నాల్గవసమావేశము

బులుసు వేంకటసుబ్బారావుగారి

## ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసము

సహృదయులగు మిత్రులకు నమస్కార పూర్వక స్వాగతము:— దేశభాషా సేవాతత్పరులు, నవ్యసాహిత్యనిర్మాతలు, మహదాశయులు నగు తమరెల్లరు మాయాహ్వానము మన్నించి శ్రమలకోర్చి విచ్చేయుట మిక్కిలి యానందమగుచున్నది.

నేటి సందిగ్ధపరిస్థితులలో నిట్టి పరిషత్సమావేశము మిక్కిలి యవసరము.

ప్రపంచ మన్నివిధముల నత్యంతవేగమున నూతన పరిణామము లందుచున్నది. రాజకీయ, సాంఘిక, ఆర్థిక, మతాది విషయము లందెల్లెడల విచిత్రగతుల విప్లవ పరిభ్రమణము ననుదినము గాంచుచున్నాము. నరుడు నిత్యజీవనమున గాలి కంటెను గూడ స్వేచ్ఛయే యవసరమని పలుతెరగుల తహతహలాడుచు దపించుచున్నాడు. ఈతృష్ణ ఈయావేశ మానవుని సర్వకృషులయందును, సంస్థలయందును, కళలయందును సర్వత్ర సుస్వరూపమున సంకేతమై గోచరించుచున్నది. ప్రతిజాతియు ముఖ్యముగ స్వదేశీయ సారస్వతమునందే నిజజీవితము ప్రతిఫలింపజేసి యమృతత్వసిద్ధి బడయుచుండును. అట్టిచో నాంధ్రసారస్వతమునందు మన జాతీయహృదయరాగములు మిశ్రితములగుచుండుట సహజము-ప్రకృతిధర్మము. ఈసత్యమును విచక్షణతో గుర్తెరింగి యంగీకరింపకుండుట యవివేకము.

సమగ్రదృష్టితో పరికించినయెడల సారస్వతము సంగు కేవలము కొన్ని కావ్యములు నవలలు నాటకములు మొదలగునవి మాత్రమేగాక మానవుని జ్ఞానవిజ్ఞానముల పెంపొందించు సకలశాస్త్రములును నరునకు నిత్యజీవనమున శాంతి సౌఖ్యభద్రతలను గూర్చు నుపాయంబుల దరచి తర్కించి నరసి నెరింగించు నెల్లవ్రాతలును జాతీయసారస్వతమున స్థానముగలిగి యున్నవి. ఈ దృష్టితో పరికించిన నేడు మన సారస్వత మెంత పేదపడి యున్నదో బాగుగ తెలియగలదు. ఆంగ్ల సారస్వతముతో గాని వంగసారస్వతముతో గాని పోల్చి చూచిన యెడల మన తెనుగెంత క్రిందై యున్నదియు స్పష్టమగును. మనవారింతవరకు త్రొక్కియైన చూడని నూత్న సంధులెన్నియో కనబడుచున్నవి.

ఆంధ్ర విశ్వ విద్యాలయమున విద్యార్థులకు విశ్వయెల్ల దేశభాషయందె గరపవలయునను మహదాశయము కలదు. అది నెరవేరుట కెన్ని విఘ్నము లగు నడ్డంకులు గలవో, ఆయాటంకము లేతీరున దొలగునో కవిమండల మండితమగు నీనవ్యసాహిత్య పరిషత్సభ గమనింపవలసి యున్నది. గసయోగసమాధి యందు కవికి సర్వము కరతలామలకమగును. కవి క్రాంతదర్శి సర్వజ్ఞుడై ద్రష్టయు స్రష్టయు తానై నగుచున్నాడు. కవిగాంచి పలికిన పలుకు వేదవాక్యముగ నెనుగా నేదును లేపు ను గూడ నమోఘమై లోకమున నెల్లుచుండును.

ఆదిని జ్ఞాననిధి వేదము మాత్రమే యుండెను. అశ్రుతులనుండి స్మృతులు-అందుండి పురాణములు, తదుపరి యితిహాసములు —ఇంకను రాను రాను కావ్యములు నాటకములు హరికథలు కీర్తనలు యక్షగానములు ఏలపదములు మొదలగు నవెన్నియో—ఒక్క బీజములోనుండియే తత్సారమునే గొనుచు వృద్ధిచెందుచు బయల్వెడలిన తరుశాఖా పత్ర పుష్పాదులవలె—నుద్భవించుచుండుట మన మెరుగుదుము. ఎప్పటి కప్పుడె యింకను పెక్కుజీవుల కుపచరించు కొరకని యె వృక్షము నింకను నూతన శాఖల బెంచి విస్తరించుచుండవలయు నని ప్రకృతి శాసించుచున్నది. శ్రుతులు కఠినమైనవారి కొరకు స్మృతులు—అవియు గ్రాహ్యముకాని వారలకు పురాణములు—అవియు భారమైనచో కావ్యాదులు—ఈరీతిగ విస్తరిల్లి సాహిత్యము ప్రబలియున్నది. కావున సారస్వతము విశ్వతోముఖమై వెలయుటయేగాక సర్వజనులకు సకలసౌఖ్యానందముల సమకూర్చ గలిగినదిగ నుండుటయు, కలకాలము నిత్యమై సత్యమై నిలిచియుండగలుగుటయు గూడ నాదర్శములుగా గలిగియుండెను.

ఈవిషయముల నెల్ల నవీనసాహిత్యాభిమానులును ప్రాచీనసాహిత్య పక్షావలంబులును కూడ నంగీకరించుచున్నారు.

కాని నవీనులు తమ పూర్వమందలి యాంధ్రకావ్యము లందు జీవకళ లేదనియు విసుగుపుట్టించు అనుకరణమె మెండనియు, అశ్లీల-అసభ్యవర్ణనాదులు కలవనియు, అవి దుర్నీతిని ప్రోత్సహించుచుండుటచే గూడ నటనట కళంకితమైయుండెననియు—జీవభాషమ్యగ్యమై, ఛందోవ్యాకరణాది నియమబద్ధమై, విపులసమాస భూయిష్ఠమై, దుర్గ్రాహ్యమైయుండెననియు జెప్పుచున్నారు.

సనాతనపక్షపాతులుగూడ జీవకళారాహిత్యమునుగాని, అనుకరణప్రాధాన్యమునుగాని, అశ్లీలాది అసభ్యవర్ణనములను గాని, అవినీతిప్రేరణమును గాని, దుర్గ్రాహ్యమగు నారికేళాది పాకములను గాని గుణములని పరిగణించుటయు గనబడదు. మీదుమిక్కిలి నవ్యసాహిత్యమునందె మనము చెప్పిన యీదోషములన్నియు గలవని యనేకోదాహరణముల నెత్తి చూపుచున్నారు.

కావున పర్యవసానమేమన? కావ్యము సజీవమై యుండవలయు. దుష్టవర్ణనములుండగూడదు. దుర్నీతిప్రేరణము తగదు. అనుకరణము ప్రశస్తముకాదు. నారికేళపాకరచన లగమ్యములు. సర్వజనులకు గ్రాహ్యములై, హృద్యములై, రసవంతములై, ఆనందజనకములై, ఉత్తమాదర్శప్రబోధకములైన వ్రాతలే సాహిత్యమునను వన్నెయు, జాతికి గౌరవమును, ఆత్మకు వికాసమును గూర్చునవై యెన్నికగని వెలయుచుండును.

కనుక మన మీ పరిషత్సభయందు ధర్మదీక్షతో నాత్మపరీక్ష గావించుకొని, లోకము మనయందు గలవనుచున్న దోషములు నిజముగా మనయందుగలవా? లేవా?—లేనిచో మనలను లోకము సరిగ నర్థము చేసికొనునటుల జేయుటయెట్లు!— దోషములున్నచో—అట్టి దోషములను మనము తొలగించుకొనుట యెట్లు? అను విషయము

లను మున్ముందు నిర్ణయించుకొనవలసియున్నది. ఒక కవి రసావేశమున "లోకముతో మనకేటికి......" అని యేమేమొ పాడియున్నాడు. ఔగాక!—కాని నేలవిడిచిన సాముతగునని మన యిట్టి పరిషత్సభ యంగీకరింపజాలదుగదా!

తొల్లి యెవ్వరో కొందరుమాత్రమె వారలకు దైవికముగ గలిగిన మహావేశముతో గవితావాహినిని నూతనపంథల మరలించుకొనుచుబోవునాడు వారలకు నియమములు శాస్త్రములు శాసనములు—అక్కఱలేకపోయిన పోవుగాక! అట్టివారికి గూడ దుష్యంతునకువలెనె యంతర్వాణియె ప్రమాణమైయుండిన నుండవచ్చును. కాని వారి పోకడలనె పెక్కుగ నధికారులు ననధికారులు గూడ ననుసరించుచుండుట కొంతవరను పరిపాటియై కనబడుచున్న నేడుకూడ నంతర్వాణిసిద్ధాంతమె యెల్లరకు పట్టుగొమ్మగ నుండజాలదు—ఉండజనదు!

అందుచే మన పరిషత్సభ నవ్యసాహిత్యకేదారముల కృషిసల్పుచుండువారల కవసరమైయనువైయొప్పు మార్గముల సూచించు సూత్రముల నిర్మించుటావశ్యకమై కనబడుచున్నది. లేనియెడల గట్టుపుట్టలులేని వ్యవసాయమువలె, కళ్లెము తెగిన గుఱ్ఱమువలె, ఒడ్డువిరిగిపోయిన వెల్లువవలె—అగుచు, మహత్తరఫలితముల నొసంగగల యమూల్యకవితావేశము, అపూర్వనిర్మాణకౌశలము వ్యర్థమై, నిష్ఫలమై యొక్కొకచో దుష్ఫలదాయియై భయంకరమగుచుండుట గూడ గాననగును. మహాకవి పరమేశ్వరుడే తన శాసనములకు దాను బద్ధుడైయుండుటకై శాసనముల నిర్మించుకొనుచుండ మనమేల యామార్గమవలంబింప సంకోచము?

తదుపరి, భాషయందు కొన్ని స్వరములకు చిహ్నములు లోటుగ కనబడుచున్నవి. (F. A. Z.) మొదలగు స్వరములు లేవు. అట్టిస్వరములను మనము సామాన్యముగ ప్రతిదినము నుచ్చరించుచున్నాము. అట్టి స్వరములతోకూడిన పదములను (హిందీ-ఇంగ్లీషు-ఉర్దూ మొదలగు భాషలలో పుట్టి మనదేశమునందు ప్రచారములోనికి వచ్చినవి) మనభాషయందు చేర్చుకొనవలసిన యావశ్యకత పెక్కుసందర్భముల గలుగుచున్నది. కావున ఆచిహ్నములు లేని లోటును మన మేరీతిని తీర్చుకొనతగునో నిర్ణయించుకొనవలయును.

మరియు, మన తెనుగునం దనేక కారణములచే గొరతపడి యున్నట్టియు, నేడు భాషాసౌష్టవమునకు గాని, వివిధశాస్త్రరచనలకు గాని, అట్టి మరి యేయితరప్రయోజనములకు గాని యవసరమైనట్టియు అన్యభాషాపదముల నెటుల మనము సేకరించుకొనవలయును? అను విషయమును చర్చించుకొని ఏవో కొన్ని పద్ధతుల నేర్పాటుచేసికొనుట యవసరము.

సాహిత్యశృంగాటముల విహరించు నానందమును, సంస్కారము చాలని కొందరు, నోవనీనోవదనులకు గలుగజేయునలయునను వలంపుతో మిక్కిలి తేలికయగునట్టియు, నిత్యము వాడుకలోనున్నట్టియు నగు మాటలను—ఏవిధముగను సంస్కరింపకయె—మనము గ్రంథములయందు వాడుచుండుటవలన మన యాశయ మెంతవరకు నెరవేరినదో తెలిసికొనవలసియున్నది. మనయాశయము పూర్తిగ నెరవేరనియెడల నద్దానికి కారణముల నరసి కర్తవ్యము నిశ్చయించుకొనవలసి యున్నది.

"నవ్యసాహిత్యము"నకు స్వరూపలక్షణాదుల నిర్ణయించుచు నింతవరకుగల యాంధ్రసారస్వతమునొక్క లక్ష్యలక్షణాదులతో నెంతవరకు సమన్వయింపనగునో, ఎట సమన్వయము కుదురదో సవిమర్శంబుగ లోకమునకు తెలియజెప్పవలసిన బాధ్యతయు మనపైకలదు.

వివిధశాస్త్రముల తెనుగులో వెలయింపజేయుటకువలయు పలుతెరగుల సాధనసామగ్రి సమకూర్పవలసిన బాధ్యతయు కార్యదీక్షానిరతులగు నవ్యసాహిత్యనిర్మాతలపై కలదు గావున ఆభారమునుగూడ మనము వహించి నిర్వహింపవలసియున్నది.

మరియు మనలక్ష్యమునకును నన్నయ, తిక్కన, పోతన, పెద్దన, సూరన, శ్రీనాథ మొదలగువారి లక్ష్యమునకును ప్రధానవిషయములందనివార్యసంఘర్షణము లేనియెడల, పరులకడ కొనరాదను విశాలహృదయమును మనము ప్రదర్శించి, మనపరిషత్తునందాంధ్రసాహిత్యాభిమానుల కందరకు స్థానమిచ్చి, సకలసంపూర్ణమై సర్వతోముఖమై మన పరిషత్సభ కావ్యసాగరముల కడ్డుపడిపోవు కపికుమారుల కెల్ల ధృవనక్షత్రమై వెలయునటుల చేయుదముగాక యను సంకల్పోత్సాహముతో మాశక్తిమేర తలంపక మిమ్మందర నిట కాహ్వానించి యీపరిషత్సభ సమావేశపరచితిమి.

ఈనాడు మనయాంధ్రదేశమందు బయలువెడలిన యీనవ్యసాహిత్య సమస్య భరతఖండమున మనతోటి రాష్ట్రములన్నిటను గూడ ప్రబలియున్నది. ఎల్లెడల నవీనప్రాచీనపక్షావలంబులనడుమ ననవసరమగు పరస్పరవైరుధ్యము మాత్రమె ప్రబలజాతీయసారస్వతమునకు దోహదమొనర్చుటకు మారుగ నంతఃకలహముల బెంచుకొనుచున్నారు. పరగ్రంథాన్వేషణమే ప్రధానకర్తవ్యముగ బెట్టుకొని స్వాభిమానసిద్ధాంతములలో పాతుకొని యీషణ్మాత్రమైన జరుగనొల్లక—ఒకరు 'కా' యనిన రెండవవారు 'కీ' యనుటయె ముఖ్యోద్దేశముగనున్నంతకాలము మన భాషకుగాని దేశమునకుగాని మేలులేదు.

ప్రాతదెల్ల పాడని తలంచి తాను కొమ్మనంటి నిలిచియుండి చెట్టుమొదలు నఱుకబూనుట వివేకముగాదు. చెట్టు మొదలు కాలక్రమమున పెరిగి బెరడుగట్టి యందవికారమైనటుల నే కనబడవచ్చును. అంతరాళమున నందము దొంతరగులుగ వ్రేలాడుచున్నటుల నే దోపవచ్చును. అయినను అది చక్కగ పెంపొందవలయునన్న తమ మూలమున త్రవ్వి చేసి దోహదమొనర్పవలె—లేగొమ్మలతీర్చి సుందరముగ దిద్దవలె—క్రొంజివురుల, పూబింతెలవంటి పాడొనర్చు చీడపురుగుల నేర్పుతో తొలగింపవలె—వెట్టితలల త్రుంచి సంస్కరింపవలె—

ఆనాడె గద! మన సాహిత్యరసాలము నల్దిశల శాఖోపశాఖలుగ విస్తరించి, నూత్నపల్లవములతో—మధునిష్యంద కుసుమరాజితో—సహజపరిపక్వమధురఫలసంపదతో—ఆనందపారవశ్యమున గీతము లెత్తి సంకీర్తనము చేయు శారికాకీరపంక్తులతో హృదయరంజకమై యాంధ్రదేశము నెల్ల తన చల్లనినీడను జేర్చుకొని, తేర్చి, జాతికి పుష్టి తుష్టి నొసంగి ధన్యమగుట!

అచిరకాలముననె మనమా సుదినము గాంచగలుగుదుమని తెల్పు శుభశకునములుగ పింగళివారు, మల్లవరపువారు, రాయప్రోలువారు, మనకెట్టయెదుట కాన్పించుచున్న శివశంకరశాస్త్రిగారు శ్రీకృష్ణశాస్త్రిగారు మున్నగువారు చేయు కవితాగానములు వినిపించుచున్నవి.

౭. పాండవులు తమ కృత్యములు తెలుపుట.

౮. ద్రౌపది తన మెలంగు విషయమునఁ జూపిన గరువఁదనము.

౯. ద్రౌపది తాను నీచపుఁబనులు జేయననుట.

౧౦. సుధేష్ణతోఁ దన్నుఁ గామించినవారిని హరిహరాదు లడ్డమైనను దనపతులు గంధర్వులు నాశనము గావింతురని నాటకము నందువలెఁ గావ్యార్థసూచన చేయుట.

౧౧. విరాటునగరమునఁ బ్రవేశించుచుచో మూలమున ధర్మజ—భీమ—ద్రౌపది—సహదేవ—అర్జున—నకులు లనుక్రమమునఁనుండఁ దిక్కన మార్చి క్రమప్రవేశము గావించెను.

౧౨. మూలములో పాండవులు విరాటునగరమునకు దూరముగా నున్నారని యుండఁగాఁ దిక్కన ద్రౌపది నడవలేక చెప్పిజనించె వ్రేళుల పుటంబుల ఇత్యాదుల మార్పుచూపెను. మఱియు మూలములో అర్జునుని డెత్తుకొని నట్టులుండ నిట భీమునిఁ దిక్కన యెత్తుకొనఁజేసెను.

౧౩. మూలమున ఆయుధములు నకులుఁడు జమ్మిపైఁ బెట్టినట్టు లుండఁ (గొన్ని ప్రతులలో సహదేవుఁడనికూడఁ గలదు) తిక్కన ఆపని ధర్మజుచేఁ జేయించి భీముఁడు కోపి కావున వానికి లభింపకూడదని యాయుధరాజముల వేఁడుకొనఁ జేసెను.

౧౪. మూలమున ఉత్తరునిమాటల నర్జునుఁడే విని తన్ను సారధిగాఁ జేసికోమని ద్రౌపదిద్వారాఁ గబురుపంపెనని యున్నది. తిక్కన:—ఉత్తరుఁడు నారీజనముమధ్యమునఁ దనకు సారథిలేమికి వాపోవుట ద్రౌపదివిని యర్జునున కెఱింగించెనని మార్చెను. అర్జునుఁడు అజ్ఞాతవాససమయము ముగియవచ్చుట ద్రౌపది కెఱింగించి యియ్యకోలు సూప నామె యుత్తరకుఁజెప్ప నాపె యర్జునునిఁ దోకొనివచ్చుట—ఇది యంతయుఁ దిక్కన చేసిన మార్పే.

౧౫. భీముఁడు విరాటు కొల్వున మల్లుల విఱచుట మూలమున లేదు. పైఁగా సింహగమనుఁడని మూలములోఁ గలదానిని 'గజగమనుఁడని'మార్చి తిక్కన కుస్తీవస్తాదుల మందగమనమును సూచించెను.

౧౬. మఱియు మూలములో, మల్లులతోఁ బోరువాడు తన సభలో లేకపోవుటచే వారిమడిమాన్యాలు లాగుకొందునని విరాటుఁ డన్నట్లు కలదు. అది రాజు తేలికగొనము నగపఱ్చునని కాఁబోలు దిక్కన త్యజించి "జనపతి వేడ్క—మోడు పడుచందముచూచి ధర్మరాజు భీముఁడు (వలలుఁడు) గలఁడని" చెప్పినట్లు మార్చి యౌచిత్యము గాపాడెను. మఱియు మూలములో భీముని ఆకారవర్ణనము చూపలేదు. తిక్కన, మల్లవర్గముగని భీముఁడు మైపెంచుట ఖాలమున మన్ను రాచికొనుట మల్లయుద్ధములోఁజూపిన నీసాన—ఉపతాయి—తోసహత్తము—తాళంబిచ్చుట—మున్నగు కుస్తీపేచీలు చూపి మూలములో లేని వన్నె తెలుఁగునఁదెచ్చి యాంధ్రతత్వము నెఱపెను. మల్లులఁ జంపినట్లు తిక్కన వ్రాయలేదు.

ఈరీతిగఁ బ్రతిఘట్టమునఁ దిక్కనఁ బెక్కుమార్పులు గావించి తెలుఁగుభారతమునకు నెంతయో వన్నెయు వాసియుఁ గూర్చెను. ఇఁకఁ గీచకవధ ఘట్టమునఁ దిక్కన చూపిన మార్పులు నాల్గుమూఁడు చూపి పిమ్మట విశేష్య క్రియలఁదెల్పి వ్యాసము ముగించెదను.

## కీచకవధ ఘట్టము

౧౭. ద్రౌపది ౧౫ రోజులున్నదనఁగాఁ గీచకునికంటఁ బడెనని తిక్కన. మూలములో ౧౦ నెలలనియున్నది. ఈమార్పునకుఁ గారణము ముందు గాన నగును.

౧౮. దక్షిణ గోగ్రహణము—ఆషాఢసప్తమి. (దక్షిణదేశపానము—కృష్ణాష్టమి)

౧౯. తిక్కన, కీచకుని, రూపాభిమానిని—అభిమానశీలుని—మర్యాదగుని—బలగర్వితుని గాఁ జేసెను.

౨౦. తిక్కన నాయికా నాయకుల మానసిక వృత్తులను జాల రమ్యముగాఁ జూపును.

౨౧. 'కుసుమబాణుని బాణముల్ గూడ నైము, కరఁగి నేరుపి వాటించి కనువుగట్టి, పోసిచేసి చైతన్య సంపుటముఁ దగఘటించి రఁట ద్రౌపదిని:—ఇది పెద్దనకే యనుకరణీయ మయ్యెఁగా.

౨౨. ద్రౌపదీ కీచకులనుగూర్చిన మనోవృత్తి వర్ణనము అంతయు మూలములో లేనిది తిక్కన కల్పించెను. మూలములో 'తాం దృష్ట్వా...ఇత్యాది ౧౨ శ్లోకాలు మాత్రమె.

౨౩. ద్రౌపది కీచకుల సంభాషణములు తెలుఁగున వన్నెకెక్కినవి. మూలములోవలె "దాసస్తవాహం పృధుతామ్రలోచనే" అనిపించలేదు తిక్కన.

౨౪. కీచకుఁడు రూపాభిమాని: కావుట ఆమె పుట్టుపూర్వముల నడిగినాఁడు మూలములోవలె, నీవు మెఱపువా? తారవా? అని యడుగుచు అత్యుక్తికిఁ బోలేదు. రూపాభిమాని కావుననే "మన్మథుఁడు సమయించిన మగుడ నన్నుఁ బ్రదుకఁజేయవచ్చునే ద్రౌపదీ" అన్నాఁడు.

౨౫. పరాంగనపైని దనచూడ్కి నెక్కొల్పుటయేగాక కేలుఁ గేలఁ గీలుకొలిపి నిజానురక్తిఁ దెలుపనెంచినపుడు మాత్రమె కీచకుఁ డధముఁడైనాఁడు.

౨౬. మఱియుఁ దిక్కన కీచకుఁడు మూలమందువలె నుపన్యాసమీయక ఆమె రూపురేకల వర్ణించి స్వాధీనముఁ జేసికొన నెంచెను.

౨౭. తిక్కన సంభాషణము యుక్తిప్రత్యుక్తి రూపముగా నడపునేకాని సబబుతప్పి నడపఁడు:—"నీవు దుర్జాతివి కావు. పరాంగనా రతివల్లవచ్చు పాపమునోర్తుగాని కాముని కోర్వను"—అని కీచకునిచేఁ బలికించెను.

౨౮. రూపాభిమానియైన తిక్కన కీచకుఁడు, మూలములోవలె సిగ్గువీడి తోఁడఁబుట్టిన దానితో "సుందరం పురుషం దృష్ట్వా భ్రాతరం పితరం సుతం యోని ర్ద్రవతి నారీణా" మని యనౌచిత్యముగాఁ బలుకలేదు.

# వ్యాఖ్యానములు

## చక్రవర్తి

ఉదారాశయులగు అయిదో జార్జిచక్రవర్తిగారి మృతికి ప్రపంచం అంతా దుఃఖించింది.

జార్జిచక్రవర్తిగారి జీవితం ఉత్తమ మానవ జీవితానికి పరమావధి. ఆదర్శంగా గ్రహించతగ్గది.

జార్జిచక్రవర్తిగారికి మోక్షం కలుగుగాక.

పరమోత్సాహ భరితులయిన ఎనిమిదవ ఎడ్వర్డు చక్రవర్తిగారికి మా స్వాగతం నివేదిస్తున్నాము.

## ఇక చెప్పడాని కేమున్నదీ?

కాంగ్రెస్సుకి యాభైయేళ్లు నిండాయి.

మొన్న మొన్ననే దానికి స్వర్ణోత్సవం జరిగింది.

ఉత్తరకయస్సు భుక్తం అవుతోంది.

కాని, తనను భారతీయత్వమే గాని ఆంధ్రత్వం పనికిరాదనుకునేటంతటి ఉద్రిక్తచిత్తుడైన ఆంధ్రుడికి ఆ కాంగ్రెస్సు వేదక మీద యింతవరకూ స్థానం దొరకలేదు.

ఎందరో బెంగాలీలు, ఎందరో హిందూస్థానీలు, ఎందరో తమిళులు, ఎందరో మహారాష్ట్రులు, ఎందరో గుజరాతీలు, పంజాబీలు, పార్శీలు, మాహమ్మదీయులు, యురపియనులు—చివరికి కోటికి కూడా తక్కువగా ఉన్న మళయాళీలు సైతం కాంగ్రెస్సు గద్దె యెక్కారు; కాని ఆంధ్రుడు మాత్రం నేటికిన్నీ వలంటీయరుపదవిలోనే ఉన్నాడు.

లిబరల్సులో ఆంధ్రుడు నాయకుడు. జస్టిసైట్సులో ఆంధ్రుడు నియంత. సంస్కర్తలలో ఆంధ్రుడు ప్రముఖుడు. శాస్త్రవేత్తలలో ఆంధ్రుడు అద్వితీయుడు. పత్రికాసంపాదకులలో ఆంధ్రుడు అదర్శమూర్తి. ఖండాంతర విశ్వకళాపరిషత్తులలో మొట్టమొదట అడుగుపెట్టినవాడు ఆంధ్రుడు; కాని కాంగ్రెస్సులో మెట్టుకు వేదిక సమీపించడానికైనా ఆంధ్రుడికి అర్హత లేదు.

ఏమీ?

ఆంధ్రుడుకి కాలికింద మట్టి ఉంటేనా!

రాజేంద్రప్రసాదుగారి చరిత్ర విప్పండి. ఆయన కార్యక్షేత్రం బీహారు లోపల్లోపలే. సర్దార్ పటేలు సంగతి చూడండి. ఆయన విహారభూమి ఒక్కగానొక్క తాలూకా—బార్డోలీ మాత్రమే. గోఖ్లే, లజపతిరాయి, చిత్తరంజనదాసు—ఎవర్ని చూసినా వారందరూ తమ ప్రాంతాలలో జీవితాలు ధారపోసినవారే.

అయితే: కాంగ్రెస్సాంధ్రుడు?

ఖిలాఫత్తుకోసం అతడు త్యాగం చేశాడు. బార్డోలీ రైతులకోసం జైలుకి వెళ్ళాడు. హిందీకోసం తన తల్లిభాషను హత్య చేస్తున్నాడు.

సుభాస్‌చంద్రబోసుగారు బయలుదేరారంటే బెంగాళా అంతా కదులుతుంది. జవహర్లాలాల్‌గారు సంయే అన్నారంటే హిందూస్థానీ లంతా తయార్. ఇంతెందుకూ? సత్యమూర్తిగారిని చూడండి. తమిళ్‌నాడు అంతా ఆయనకు ఆసరా అవుతుంది.

ఏదీ, ఒక్క కాంగ్రెస్సాంధ్రుడికైనా ఇలాంటి ఆత్మశక్తి?

ఒక్క ఆంధ్రాప్రావిన్షియల్ కాంగ్రెస్సుకమిటీ అయినా పట్టాభిసీతారామయ్యగారి నేకగ్రీవంగా అధ్యక్షపదవికి సూచించలేనప్పుడు ఇక కాంగ్రెస్సాంధ్రుడికి నరాలలో పటుత్వం ఉందని యెలాగా చెప్పడం?

పోనీ, ఒకోన్న కాంగ్రెస్సులో జవహర్‌లాలుగారు అధ్యక్షోపన్యాసం తమ మాతృభాషలో వెలువరిస్తారు. రాజేంద్రప్రసాదుగారు సరేసరి, యీ మధ్య "మీరంతా మాహిందీ నేర్చుకుంటే గాని మీకు ముక్తి లేనేలే"దని చెప్పడానికే దక్షిణహిందూదేశం అంతటా సంచారం చేశారు. "హిందీప్రచారి" అని గర్వంతో చెప్పేమనే గాంధిగారు ఆధునిక గుజరాతీవాఙ్మయనిర్మాతలలో ప్రముఖులే.

ఇక మన పట్టాభిసీతారామయ్యగారు?

"తెనుగులో పత్రిక లెందుకూ?" అన్నవారే కారూ వారూ?

ఇంతకీ: ఈమాటయినా ఆంధ్రుణ్ణి కాంగ్రెస్సు గద్దె యెక్కించాలని తెనుగుపత్రికల్లో ఏకసింతో ఆందోళన కనపడింది. దీనిని బట్టి, ఆశ సఫలమయినా కాకపోయినా ఆంధ్రాప్రావిన్షియల్ కాంగ్రెస్సుకమిటీ అయినా ఆంధ్రుణ్ణి మాత్రమే ఏకగ్రీవంగా సూచిస్తుందనుకున్నాము.

కాని కాంగ్రెస్సాంధ్రుల దృష్టిలో ఆంధ్రాభిమానం క్షుద్రం; కనకనే వారు పట్టాభిసీతారామయ్యగారిని మాత్రమే సూచించి ఊరుకోలేకపోయారు.

ఇతర్లకు ఆంధ్రులంటే యెలాగా లక్ష్యం లేదు. ఆంధ్రులుకూడా అలాగే అయినప్పుడిక ఆంధ్రుడికి అధ్యక్షత యెలా దక్కుతుందీ?

పోనీ, ఆంధ్రుడనే భావంతో కాక భారతీయుడని అయినా తత్త్వమాత్రావాగంతా పట్టాభిసీతారామయ్యగారిని సూచించకూడదా అంటే, పరిమితమైన ఆంధ్రత్వానికే పుష్టి కలిగించలేనివారిని, అపరిమితమైన భారతీయత్వానికి నవజీవం పొయ్యగలుగుతారని యెలాగా విశ్వసించడం!

ఇతరరాష్ట్రాలవారు, తమతమ పరిస్థితులను బట్టి భారతదేశపు స్థితిగతులను నిశ్చయించుకుంటారు. మన కాంగ్రెస్సాంధ్రులు, అలా కాక, ఇతర్ల మాటలను బట్టి భారతదేశం బోధపడిపోయిందని ఉపన్యాసాలు ప్రారంభిస్తారు.

ఇంచేతనే ఇతర్లు, కాంగ్రెస్సులో తాముగా ప్రవర్తిస్తారు. ఆంధ్రులు భారతజాతియొక్క సమష్టి రూపంతో చుట్టూచుట్టూ తిరుగుతారు.

ఉన్న భేదం యిదీ. అంటే మన కాంగ్రెస్సాంధ్రుల దృష్టి బహిర్ముఖమే కాని అంతర్ముఖం కాదు.

ఆంధ్రేతర, మనవారు, ఇతర్ల తాఖీదులకోసం యెదురుచూడవలసిందే: గాని సొంతంగా కార్యక్రమం యేర్పరుచుకోలేరు.

ఇక చెప్పడాని కేమున్న దీ?

## నవ్యసాహిత్యపరిషత్తు—నాల్గోసమావేశం

నిరుడే యిది కాకినాడలో జరుగుతుం దన్నారు. తరవాత నెల్లూ రన్నారు. ఆపైని మద్రాసని తెలిసింది; కాని చివర కిది, మొన్నటి జనవరిలో, కాకినాడలోనే జరిగింది.

నిరుటినుంచీ—మదరాసులో జరుగుతుం దన్నప్పుడు కూడా ఎవరు అధ్యక్షత వహిస్తారని చెబుతూ వచ్చారో, సభలో కూడా ప్రత్యక్షంగా ఉన్నారో ఆచింతా దీక్షితులుగారు కాక, యీసంవత్సరం, కావ్యవ్యాకరణతీర్థులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు అధ్యక్షు లయినారు.

ఆంధ్రసాహిత్యపరిషత్తూ యిదిగో అదిగో అంటూ రెండేళ్లకి—మొన్న మొన్ననే అమలాపురంలో కూడినది. ఈనవ్యసాహిత్యపరిషత్తున్నూ అలాగే వాయిదాలమీద వాయిదాలు వేసి రెండేళ్లకే సమావేశం అయినది.

పైగా, నవ్యసాహిత్యనిర్మాతలలోనూ, నవ్యసాహిత్యపరుల లోనూ, నవ్యసాహిత్యప్రియులలోనూ, నవ్యసాహిత్యపోషకులలోనూ తప్పకుండా రావలసినవారూ, వచ్చి మహోల్లాసంతో పాల్గొనవలసినవారూ ఎంతోమంది యీసమావేశానికి రాలేదు.

ఆపైని, నాగేశ్వరరావు పంతులుగారు సభోపక్రమణం చెయ్యలేదు. ఆసమయానికి వారు రానేలేదు. ఆహ్వానసంఘంవారు, మరొకరినైనా అందుకు నియోగించాలేదు.

వచ్చిన కొద్దిమంది అయినా సాహిత్యపర్యాలోచన లేమీ చెయ్యలేదు. ఆహ్వానసంఘంవారు అసలా విషయం కార్యక్రమంలో చేర్చనే లేదు.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారు, పూర్వవ్యాకరణగ్రంథాలను గురించీ, పూర్వప్రబంధాలను గురించీ పత్రికలో ప్రకటించుకోడం కోసం వ్యాసాలు వ్రాయించి వాటిని సభలో చదివిస్తారు. ఈ నవ్యసాహిత్య పరిషత్తువారున్నూ అలాగే, పత్రికలలో పడిన కొందరు యువకుల రచనలను వారిచేతనే సభలో చదివించారు. తరవాత సభలోకూడా అలాంటివే రెండుమూడు రచనలను తత్కర్తలచేత చదివించారు.

ఒక్క తెలికిచెర్ల వెంకటరత్నంగారు మాత్రం—ఒక్క మంచి వాక వ్యాఖ్యాతీశ్వరశాస్త్రిగారు మాత్రం గమనింపతగిన విషయాలు ఉపన్యసించారు.

రెండు నాటికలు ప్రదర్శించబడ్డాయి. వాటిలో శిరుపావశాస్త్రిగారు రచన బాగున్నది. పద్మావతీచరణచారణ చక్రవర్తి నటన బాగున్నది. సభకు చాలామంది వచ్చారనిన పత్రికావిలేఖకుల రాత ఈ సందర్భంలో మాత్రం పూర్తిగా నిజం.

మొత్తంమీద నవ్యసాహిత్యపరిషత్తుయొక్క యీ నాల్గోసమావేశం నవ్యసాహిత్యనిర్మాతలకు ఎలాంటి సందేశమూ యివ్వలేకపోయినది. నవ్యసాహిత్యపరులకు ఆంధ్రసాహిత్యంలో నవ్యత సెంత మాత్రమూ కనపరచలేకపోయినది. నవ్యసాహిత్యప్రియులను కించిత్తూ కూడా ఆకర్షించలేకపోయినది. నవ్యసాహిత్యపోషకులకు ఉత్సాహాన్ని రేకెత్తించ లేకపోయినది.

అయిదు పూటల కాలం గడిపిన యీ నవ్యసాహిత్య పరిషత్సమావేశంకంటే కొన్ని గంటలు మాత్రమే వెచ్చించిన ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయంవారి రజతోత్సవం ఎంతో సక్రమంగా జరిగి రక్తి కట్టినది.

పైగా, యిది, యాదవదాంధ్రుల సాహిత్యానికి—విశేషించి నవ్యాంధ్రసాహిత్యానికి సంబంధించిన పరిషత్తుగానే కనపడలేదు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు యొక్క కార్యక్రమంవల్ల ఏమీ సంతృప్తి లేక నిరుత్సాహులైపోయి ఉన్నవారికి నవ్యసాహిత్యపరిషత్తుయొక్క యీ సమావేశం అసంతృప్తి కలిగించినది.

మీదుమిక్కిలి, సభలను నిర్వహించడంలో ఆంధ్రదేశానికంతటికీ అతిచతురు లైన కాకినాడనగరప్రముఖులు దీనివిషయంలో ఔదాసీన్యం చూపించడం చాలా ఆశ్చర్యకరంగా కనపడింది.

పరార్థమైన ఉత్సాహమూ, దానికి తగిన బాధ్యతా కలవారు తగినంత శ్రద్ధా, దీక్షా కనపరిస్తే తప్ప నవ్యసాహిత్యపరిషత్తుభవిష్యత్తు జేగీయమానం అయే చిహ్నాలు కనపడడంలేదు.

## ఇక తెక్కిన విషయాలా?

"ఎన్నికలలో సరదాపురుషు లంతా రాజకీయనాయకులై నిలువబడవచ్చును. త్యాగపరీక్షకు వీరు నిలువబడరు"

కాకినాడలో జరిగిన ఆంధ్రరాష్ట్రీయమహాసభలో, అధ్యక్షపీఠము నుంచి, యీమాటలు పలికిన రామలింగారెడ్డిగారు సరిగా తాము చేసినదే చెప్పారు.

రెడ్డిగారి అధ్యక్షత యింకోవిషయాన్ని స్పష్టపరిచింది. అదేమిటంటే? ఆంధ్రరాష్ట్రీయమహాసభవంటి గొప్ప సమావేశాని కధ్యక్షత వహించడానికి, పక్షంమీద హద్దూపద్దూ లేని అభిమానమూ, సిద్ధాంతంమీద నిశ్చల మైన విశ్వాసమూ, పరీక్ష వచ్చినప్పుడు అగ్గిలో కూడా దూకించే సాహసమూ, అవసర మయితే డబ్బూ, సుఖమూ, వైభవమూ—చివరికి జీవితం కూడా విడిచిపెట్టించే టంతటి త్యాగశీలతా, దేశీయు లనుభవించే అగచాట్లకు హృదయాన్ని గిజగిజ లాడించే సహృదయతా—ఇలాంటి వేమీ అవసరమే లేదు. మరేమిటంటే? సమయం వస్తే యేపక్షాన్నైనా సమర్థించగలిగే టంతటి పాండిత్యమూ, లాఠీదెబ్బలు తినీ జయిళ్ళలోమగ్గీ ఖండఖండాంతరాల వారి సానుభూతిని కూడా అయస్కాంతం లాగ ఆకర్షించిన వారి త్యాగాన్ని పొగడి, అంతమాత్రం చేతనే పరప్రత్యయనేయబుద్ధుల ఆదరాభిమానాలు గడించేటంతటి, గోదావరీప్రవాహవేగం గల వాగ్ధాటీ—ఈరెండే ప్రధానం.

రెడ్డిగారికి శాసనసభలమీద చాలా మోజు ఉన్నది. అందులోనూ రాష్ట్రీయశాసనసభ అయితేనే వారి లెక్కలో చేరుతుంది. దానికి దేశీయులకు తెలిసినవీ, వారి హృదయంలో మాత్రమే జాగరితాలవుతూ ఉన్నవీ చాలా కారణాలుండవచ్చు: కాని కాంగ్రెస్సు ధర్మసూత్రాన్ననుసరించి పరిశీలిస్తే కాంగ్రెస్సుపక్షంగా శాసనసభకు వెళ్ళడానికి వారికి చాలినంతటి అర్హత లేదు.

అయితే: వారు కాంగ్రెస్సు పక్షంగానే శాసనసభకు వెళతారు. వెళ్ళితీరతారు. వెళ్ళినే వెళ్ళారు కూడానూ.

నిజమే; కాని "రెడ్డిగారివద్ద ఏమివిశేషం చూసి కాంగ్రెస్సు, వారిని పంపించింది?" దేశీయులలో అనేకులకు ఇది ఒక పెద్ద జిజ్ఞాస.

ఇది రెడ్డిగారికీ తెలుసు. కనకనే వారు, ఎం. ఎల్. సీలు ప్రజల ఏజంట్లుమాత్రమే అనీ, ఏజంట్ల మాటకు శాసనసభలో విలువ ఉండాలంటే అది ప్రజల పరాక్రమం వల్లనూ, ప్రభావంవల్లనూ ఏర్పడుతుంది; గాని ఏజంట్లకు అలాంటి శక్తి లేదనీ స్పష్టంగా తేల్చేశారు.

వారిమాటలివి.

"శాసనసభలనేవి రాజ్యాంగపరిపాలనకు ఏర్పడిన వ్యవహారాంగములు. అట్టి శాసనసభలలో ఉండే ప్రజాప్రతినిధులందరు ప్రజలయొక్క యేజంట్లు. ప్రజలయొక్క పరాక్రమము, ప్రభావం ఎంత ఎక్కువగా ఉంటే, యీ ప్రజల తరఫున ఏజంట్ల మాటకు కూడా అంత పలుకుబడి అంత గౌరవమర్యాద ఉంటుంది. ప్రజల పరాక్రమం గాని, ప్రభావం గాని ఆత్మబలంవల్ల రావాలి. త్యాగశీలము దేశసేవానిరతివల్లను ప్రజల ఆత్మబలం, సామర్థ్యం వ్యక్తమే కావాలి"

ఇవాళ, కాంగ్రెస్సువారిలో కొందరు—పెక్కుదేశాలలో అధిక సంఖ్యాకులే ఉండాము, "శాసనసభలకు వెడుతూనే ఉన్నాము కనక మంత్రిపదవులు కూడా స్వీకరిద్దాము" అంటున్నారు. "మంత్రిపదవు లెలాగా అంగీకరించాము; కనక యీ శాసనాన్ని సద్బుద్ధితోనే అమలులో పెడదాము" అనేది దాని తరవాతి మెట్టు. అయినా కాకపోయినా మంత్రిపదవులను స్వీకరించడానికేనా, మానడానికేనా కాంగ్రెస్సువారికి సర్వాధికారాలూ ఉన్నాయి. కాని వారిలో మంత్రిపదవులు స్వీకరించాలనేవారు ఇలాంటి ఉపన్యాసాలతో తమ వాదానికి బలం చేకూర్చుకోడానికి ప్రయత్నించడం హాస్యాస్పదంగా ఉన్నది.

ఇంతే కాకుండా: కాంగ్రెస్సులో చేరదామనే ఉద్దేశంతో రైటానరబుల్ శ్రీనివాసశాస్త్రిగారు వగైరాలు పెట్టేషరతులను కూడా మన రెడ్డిగారు ఆక్షేపించడంలో సబబు లేదు.

ఇక తక్కిన విషయాలా? మహాసభ చాలా బాగా జరిగి ఉండవచ్చు.

## వర్ధమానశక్తిగల రెండో తెలుగు దినపత్రిక *

డాక్టరు పి. వరదరాజులు నాయుడుగారి తెలుగు దైనికపత్రిక, ఆంధ్రప్రజ ఈనెల ౧౦వ తేదీని ప్రారంభమై మాకార్యస్థానం అలంకరించింది.

పరిమాణమూ, కాగితాలూ, అచ్చూ గెటప్పూ చాలా చక్కగా ఉన్నాయి కాని చిత్రపటాలు తక్కువగా ఉండడం (ఈ మొదటిసంచికలో సక్లత్ వాలాగారిది ఒక్కటే ఉన్నది) మాత్రం గొప్పలోపం. పైగా సంపాదకీయాలలోని భాష సమగ్రంగా లేదు. గద్యరచనలో చెయ్యి బాగా సాగిఉండినట్టు కనపడదు. రచనలో వ్యాకరణదోషాలు కూడా దొర్లుతున్నట్టుంది. అయితే ఆరంభదశలో ఇంతో, సరియైన నిశ్చయం లేకపోవడమో—యేదో కొంత తేడాని కలుగజేస్తూ ఉన్నది. సవరించుకోవడం చాలా అవసరం.

రాజకీయ విషయాలలో నాయుడుగారు దైనికపత్రికానిర్వహణంలో చిరకాలంనుంచి గడించి ఉన్న అనుభవం స్ఫుటంగా కనపడుతూ ఉంది. పత్రిక జయం పొందుతుంది. సందేహం లేదు.

"భారతదేశస్వాతంత్ర్యసంపాదన అందరికి అంగీకృతమే; కాని స్వరాజ్యసిద్ధికై కృషి సల్పుటలో సమయానుకూలముల ననుసరించి మన పద్ధతులు కూడ మార్చుకొనుట ముఖ్య మని నమ్ముచున్నాను. భారతదేశమునకు స్వరాజ్యము అవసరమైన యెడల జాతీయవాదులు ఆంగ్ల ప్రభుత్వముతో సహకారము చేయుటయును, నిరంకుశాధికారము నిర్మూలనమొనర్చు విధానము శాసనములలో పెట్టినగాని దాని నెమరుగాని, పరిపాలన సాగింపకుండ సహాయనిరాకరణము గావించుటయు నా మతము"

ఆంధ్రప్రజ రాజకీయసూత్రం యిదీ.

బాగానే ఉన్నది. "ఆత్మోద్ధరణమా, పద్ధతీ—" అంతే రాజ్యతంత్రోపదేశం. ఇక మార్గమా? దేశకాలపాత్రలను బట్టి అది తనంతట తానే ఏర్పడుతుంది.

ఆంధ్రప్రజ సరిగా యీ దారినే అనుసరించే టట్టున్నది.

ఏసందర్భంలోనూ, ఏవిధంగానూ, ఏకారణంవల్లనూ, ఏమాత్రమూ కూడా ఈ నీతిని విడవకుండా ఉంటే, ఆంధ్రప్రజ, ఆంధ్రజాతిని సరియైన దారిలో నడిపించగలుగుతుంది.

"భారతదేశ భాషావిభాగోద్యమము, భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణముపై ఆధారపడియుండదనీ, రాష్ట్రవిభజన భాషాప్రయుక్తముగ జరుగవలె నని స్పష్టపరచుచు, ఆంధ్రరాష్ట్రమును వెంటనే నెలకొల్పుటకు "ఆంధ్రప్రజ" ఆందోళనము గావించును"

ఆంధ్రజాతి కిది దైవిక మైన సందేశం. వరదరాజులు నాయుడుగారు ఈసంగతి గ్రహించి, అంగీకరించి, అవలంబించకపోతే ఆంధ్రదేశానికి రెండో దినపత్రిక అక్కరలేకపోయి ఉండును.

* సంవత్సరచందా ౧౪—౦—౦ విడిసంచిక అర్ధణా ౪౧-౪౨ ముకొర్ నల్లముత్తు శెట్టివీధి జి. టి. మద్రాసు

చాలాసంతోషం.

ఆంధ్రప్రజకు మేము హృదయపూర్వక మైన స్వాగతం యిస్తున్నాము.

మా ఆంధ్రసోదరులు ఆంధ్రప్రజను ఆదరించి బలపరుస్తారనిన్నీ నమ్ముతున్నాము.

## కోటలో పాగా వేశాము

సర్. సర్వేపల్లి రాధాకృష్ణయ్య పంతులుగారు ఆక్స్ఫర్డు యునివర్సిటీలో ప్రొఫెసరుగా నియమించబడ్డారు.

భారతీయుడికి—ఆసియాఖండవాసికి—చివరికి యూరపియనులలో కూడా ఆంగ్లేయుడు కానివాడికి ఆ యునివర్సిటీలో ప్రవేశం లేదు.

మనలో ప్రపంచవిఖ్యాతి బడసిన పండితులు రాధాకృష్ణయ్య పంతులుగారొక్కరే. వారికే ఆపదవి రావడం బాగానే ఉన్నది.

అయితే, పంతులుగారు ఆంధ్రత్వానికి ప్రాధాన్యం యివ్వరని వదంతి.

ఇదే నిజమయితే, బ్రిటిషువారు, పంతులుగారిని బట్టి ఆంధ్రజాతిని గుర్తించే అవకాశం ఉండదు.

తన పుత్రుల వైభవం అనుభవించడానికి తనకు యోగ్యత లేకపోవడం నిజంగా ఆంధ్రమాతకు దురదృష్టమే. కాని ఒక్కటి మాత్రం ఉన్నది.

పైకి రావడానికి పంతులుగారికి, వారి జాతివారు ఏవిధంగానైనా చేయూత యిచ్చారా ?

ఏది యేమయినా సర్. రాధాకృష్ణయ్య పంతులుగారికి మా ప్రశంస విన్నవించుకుంటున్నాము. వారికి సర్వవిధాలా విజయం కోరుతున్నాము.

## ఆంధ్రరాష్ట్ర ప్రస్తావన

యథాపూర్వంగానే, యీసంవత్సరం కూడా కాంగ్రెసు తాండవంలోనే ఆంధ్రమహాసభకు ప్రత్యేక సమావేశం (కాకినాడలో) జరిగింది. రామదాసు పంతులుగారూ, దీర్ఘమైన తమ ప్రజాహితజీవితంలో యెప్పుడూ లేనిది ఆంధ్రమహాసభాధ్యక్షురాలు శ్రీమతి కామేశ్వరమ్మగారూ తమ తమ అధ్యక్షోపన్యాసాలలో ఆంధ్రరాష్ట్రాన్ని గురించి కొంచెం చురుకు పుట్టినట్టే మాట్లాడారు. అయితే యిక్కడ స్థలం చాలిందికాదు. వాటిని గురించి సావకాశంగా ఆలోచిద్దాం.

---

## విరాళాలు—విశేషచందాలు

విరాళాలూ, విశేషచందాలూ యిచ్చి యీ నెలలో ప్రబుద్ధాంధ్రను ఆదరించినవారు.

౧ బెజవాడ రామచంద్రారెడ్డిగారు
లెజస్లేటివుకౌన్సిలు ప్రెసిడెంటు, మద్రాసు ౨౫-౦-౦

౨ తురగా రామచంద్రరావు పంతులుగారు
ఇన్కమ్టాక్సు ఆఫీసరు విశాఖపట్నం ౬-౦-౦

3 డాక్టరు. జి. వి. ఎల్. నరసింహం పంతులుగారు
అనకాపల్లి 3-౦-౦

౪ పెద్దాడ రామస్వామిగారు. ఎం. ఏ.
పిఠాపురంరాజాస్ కాలేజీ ప్రిన్సిపాల్ కాకినాడ ౨-౦-౦

౫ ఏసు చినసత్తిరాజుగారు కాకినాడ ౨-౦-౦

## హిందీవల్ల తెనుక్కి జరుగుతూవున్న అపకారం

ఇటీవల, కాంగ్రెసు అధ్యక్షులు, రాజేంద్రప్రసాదుగారు దక్షిణదేశసంచారం చేసినప్పుడు, వారి హిందీ ఉపన్యాసాలను ఆంధ్రభాషలోకి పరివర్తనంచేస్తూ ఉండడానికి దక్షిణభారతహిందీప్రచారసభకు చెందిన మోటూరి సత్యనారాయణగారు కూడాకూడా తిరుగుతూ వచ్చారు. ఎక్కడ కావలిస్తే అక్కడ హిందీప్రచారకు లుండనే ఉండగా ఈ సత్యనారాయణగారే యింత శ్రమపడడానికి కారణం యేమిటో అప్పుడు అవగాహన కాలేదు. ఇప్పుడు తెలిసింది. పట్టాభిసీతారామయ్యగారు రాసిన కాంగ్రెసుచరిత్ర (ఇంగ్లీషుది) ప్రకటించి వ్యాపారం చెయ్యడానికి కాంగ్రెసు, దక్షిణభారతహిందీప్రచారసభకు అధికారం ఇచ్చింది. పైగా సుమారు అయిదువేల రూపాయలు కూడా విరాళం యిచ్చింది. దీనికి ప్రతిఫలంగా హిందీప్రచారసభ అయిదువందలప్రతులు మాత్రం కాంగ్రెసుకమిటీ కివ్వడం. తతిమ్మా అనేక వేల ప్రతుల అమ్మకం అంతా తాను స్వేచ్ఛగా వాడుకోడం— అంటే దక్షిణదేశభాషలను చంపి వాటి స్థానే హిందీని ప్రవేశపెట్టడం— ఇదీ నిర్ణయం. అఖిలభారతదేశానికి సంబంధించిన కాంగ్రెసు ఇలాగ వ్యక్తుల పలుకుబడిని బట్టి ప్రత్యేక రాష్ట్రాల ప్రయోజనాలకు సాధకం కావడం దురదృష్టం.

హూంత్ అంటే పారిపోయే పిల్లి, నాలుగు తలుపులూ బిగించి కొట్టబోతే, ప్రాణాలకు తెగించి మీదబడి, రక్కి గుడ్లు పీకేస్తుంది. జనవరి ౨౪ వ తేదీని గుంటూరిలో సమావేశమయిన గుంటూరు యువజనమహాసభ “హిందీభాషను భారతదేశమున కంతకును సామాన్యభాషగ జేయుటకై జరుపబడుచున్న ఉద్యమముయెడల “తీవ్రముగ అసమ్మతి తెలుపుచు ప్రతిరాష్ట్రమునందును మాతృభాషలనే రాజభాషగ నుంచి సామాన్యదేశభాషగ అంతర్దేశీయ ప్రాముఖ్యముగల ఆంగ్లభాషనే ప్రవేశపెట్టవలె” నని తీర్మానము ప్రతిపాదించి బహుళ సంఖ్యాకులచే అంగీకరింపచేసింది. గుంటూరుజిల్లాలోనే ఇలాంటి ప్రాతికూల్యం ప్రారంభం కావడం చాలా ప్రశంసించతగ్గది.

# సరస్వతీ గ్రంథమండలి




కంభంవారి సత్రముపీధి ⁂ రాజమహేంద్రవరము

నవలలు- నవరసభరితములగు నవలలు—ముచ్చటగూర్చు బొమ్మలతో—ముద్దులొలుకు క్యాలికో యిండుతో—రెం[illegible]ముల కొక చక్కని నవల. నడుమ నడుమ చిన్న చిన్న అను గ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము [illegible] దారులు ఒకేసారి రు 7 8-0 ను ముందుగా పంపినచో వరుసగా ఆయా పుస్తకములు అన్‌రిజిష్టర్డు పార్సిలుగా పంపుదుము.

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 11 ప్రేమసుందరి | 1 8 0 | 25 కుంపసుభగణి | 1 8 0 | 39 అగ్రహారము | 1 8 0 |
| 12 చోరశిఖామణి | 1 8 0 | 26 జాగిలము | 1 8 0 | 40 ఛిన్నహస్తము (1 వ భాగము) | 1 8 0 |
| 13 లక్ష్మీప్రసాదము | 1 8 0 | 27 మొగలాయీదర్బారు 2 భా॥ | 1 8 0 | 41 ఛిన్నహస్తము (2 వ భాగము) | 1 8 0 |
| 14 హత్యారహస్యము | 1 8 0 | 28 సరస్వతి | 1 8 0 | 42 కంకణరహస్యము | 1 8 0 |
| 15 ఫాస్టు (1 వ భాగము) | 1 8 0 | 29 ఆనందాభాయి | 1 8 0 | 43 సంజీవి (1 వ భాగము) | 1 8 0 |
| 16 ఫాస్టు (2 వ భాగము) | 1 8 0 | 30 హత్యాన్వేషణము | 1 8 0 | 41 సంజీవి (2 వ భాగము) | 1 8 0 |
| 17 కుముద్వతి | 1 8 0 | 31 మొగలాయీదర్బారు 3 భా॥ | 1 8 0 | 45 [illegible] | 1 8 0 |
| 18 చిన్నకోడలు | 1 8 0 | 32 గంగ | 1 8 0 | 46 హత్యాప్రేమ | 1 8 0 |
| 19 రహస్యభేదనము | 1 8 0 | 33 మొగలాయీదర్బారు 4 భా॥ | 1 8 0 | 47 కోశఖండనము | 1 8 0 |
| 20 సింహగడము | 1 8 0 | 34 కోహినూరు | 1 8 0 | 48 సేవాశ్రమము (1 వ భాగము) | 1 8 0 |
| 21 మణిహారము | 1 8 0 | 35 ఆటీన్ మణేలా | 1 8 0 | 49 సేవాశ్రమము (2 వ భాగము) | 1 8 0 |
| 22 మొగలాయీదర్బారు 1 భా॥ | 1 8 0 | 36 అపరిచిత | 1 8 0 | 50 దాసీకన్య | 1 8 0 |
| 23 ఘటనాచక్రము | 1 8 0 | 37 అంతఃపురము (1 వ భాగము) | 1 8 0 | | |
| 24 రాజసుందరి | 1 8 0 | 38 అంతఃపురము (2 వ భాగము) | 1 8 0 | | |

## అనుబంధములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మృత్యురంగిణి | 0 12 0 | 9 యమునాబాయి | 1 0 0 | 17 లలిత | 1 0 0 |
| 2 అభాగిని | 0 12 0 | 10 శ్యామల | 1 0 0 | 18 పెండ్లిదండ | 1 0 0 |
| 3 ఛద్మవేషి | 0 12 0 | 11 కొంటెకథలు (చిన్నకథలు) | 1 0 0 | 19 కథావళి | 1 0 0 |
| 4 విదురుని యుపదేశములు | 1 0 0 | 12 కాలసర్పి | 1 0 0 | 20 నాయకకథలు | 1 0 0 |
| 5 కాంచనమాల | 1 0 0 | 13 భారతకథాసారం | 1 0 0 | 21 స్త్రీప్రబోధిక | 1 0 0 |
| 6 సీమంతిని | 1 0 0 | 14 కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 0 0 | 22 ఆదర్శము (1 వ భాగము) | 0 12 0 |
| 7 సుశీల | 1 0 0 | 15 అరక్షణీయ | 1 0 0 | 23 ఉదంకుడు | 0 12 0 |
| 8 శశిరేఖ | 1 0 0 | 16 మాధవి | 1 0 0 | 21 భేతాళకథలు | 0 12 0 |

## నాటకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మార్కండేయ | 0 12 0 | 5 షాజహాను | 1 0 0 | 9 దంపతులు | 1 0 0 |
| 2 అహల్యాశాపవిమోచనము | 0 12 0 | 6 నూర్జహాను | 1 0 0 | 10 విజయవిజయం | 1 0 0 |
| 3 మేవారుపతనము | 1 0 0 | 7 దుర్గాదాసు | 1 0 0 | 11 భక్తకుచేల | 1 0 0 |
| 4 వరమాల | 1 0 0 | 8 చంద్రగుప్త | 1 0 0 | | |

 ఈ గ్రంథములు రాజమండ్రీలో కలాభివర్ధనీ పరిషత్తులోను దొరకును.

చాలా సంతోషం.

ఆంధ్రప్రజకు మేము హృదయపూర్వకమైన స్వాగతం యిస్తున్నాము.

మా ఆంధ్రసోదరులు ఆంధ్రప్రజను ఆదరించి బలపరుస్తారని నమ్ముతున్నాము.

## కోటలో పాగా వేశాము

సర్. సర్వేపల్లి రాధాకృష్ణయ్య పంతులుగారు ఆక్స్‌ఫర్డు యునివర్సిటీలో ప్రొఫెసరుగా నియమించబడ్డారు.

భారతీయుడికి—ఆసియాఖండవాసికి—చివరికి యురపియనులలో కూడా ఆంగ్లేయుడు కానివాడికి ఆ యునివర్సిటీలో ప్రవేశంలేదు.

మనలో ప్రపంచవిఖ్యాతి బడసిన పండితులు రాధాకృష్ణయ్య పంతులుగారొక్కరే. వారికే ఆపదవి రావడం బాగానే ఉన్నది.

అయితే, పంతులుగారు ఆంధ్రత్వానికి ప్రాధాన్యం యివ్వరని వదంతి.

ఇదే నిజమయితే, బ్రిటిషువారు, పంతులుగారిని బట్టి ఆంధ్ర జాతిని గుర్తించే అవకాశం ఉండదు.

తన పుత్రుల వైభవం అనుభవించడానికి తనకు యోగ్యత లేకపోవడం నిజంగా ఆంధ్రమాతకు దురదృష్టమే. కాని ఒక్కటి మాత్రం ఉన్నది.

పైకి రావడానికి పంతులుగారికి, వారి జాతివారు ఏవిధంగానైనా చేయూత యిచ్చారా ?

ఏది యేమయినా సర్. రాధాకృష్ణయ్య పంతులుగారికి మా ప్రశంస విన్నవించుకుంటున్నాము. వారికి సర్వవిధాలా విజయం కోరుతున్నాము.

## ఆంధ్రరాష్ట్ర ప్రస్తావన

యథాపూర్వంగానే, యీసంవత్సరం కూడా కాంగ్రెస్సు తాండవంలోనే ఆంధ్రమహాసభకు ప్రత్యేక సమావేశం (కాకినాడలో) జరిగింది. రామదాసు పంతులుగారూ, దీర్ఘమైన తమ ప్రజాహితజీవితంలో యెప్పుడూ లేనిది ఆంధ్రమహాసభాధ్యక్షురాలు శ్రీమతి కామేశ్వరమ్మగారూ తమ తమ అధ్యక్షోపన్యాసాలలో ఆంధ్రరాష్ట్రాన్ని గురించి కొంచెం చురుకు పుట్టినట్టే మాట్లాడారు. అయితే యిప్పుడిక్కడ స్థలం చాలిందికాదు. వాటిని గురించి సావకాశంగా ఆలోచిద్దాం.

---

## విరాళాలు—విశేషచందాలు

విరాళాలూ, విశేషచందాలూ యిచ్చి యీ నెలలో ప్రబుద్ధాంధ్రను ఆదరించినవారు.

౧ బెజవాడ రామచంద్రారెడ్డిగారు
లెజస్లేటివుకౌన్సిలు ప్రెసిడెంటు, మద్రాసు ౨౫-౦-౦

౨ తురగా రామచంద్రరావు పంతులుగారు
ఇన్కంటాక్సు ఆఫీసరు విశాఖపట్నం ౬-౦-౦

౩ డాక్టరు జి. సి. ఎల్. నరసింహం పంతులుగారు
అనకాపల్లి ౩-౦-౦

౪ పెద్దాడ రామస్వామిగారు. ఎం. ఏ.
పిఠాపురంరాజాస్ కాలేజీ ప్రిన్సిపాల్ కాకినాడ ౨-౦-౦

౫ ఏసు చినసత్తిరాజుగారు కాకినాడ ౨-౦-౦

# హిందీవల్ల తెనుక్కి జరుగుతూవున్న అపకారం

ఇటీవల, కాంగ్రెస్సు అధ్యక్షులు, రాజేంద్రప్రసాదుగారు దక్షిణదేశసంచారం చేసినప్పుడు, వారి హిందీ ఉపన్యాసాలను ఆంధ్రభాషలోకి పరివర్తనంచేస్తూ ఉండడానికి దక్షిణభారతహిందీప్రచారసభకు చెందిన మోటూరి సత్యనారాయణగారు కూడాకూడా తిరుగుతూ వచ్చారు. ఎక్కడ కావలిస్తే అక్కడ హిందీప్రచారకులుండనే ఉండగా ఈ సత్యనారాయణగారే యింత శ్రమపడడానికి కారణం యేమిటో అప్పుడు అవగాహన కాలేదు. ఇప్పుడు తెలిసింది. పట్టాభిసీతారామయ్యగారు రాసిన కాంగ్రెస్సుచరిత్ర (ఇంగ్లీషుది) ప్రకటించి వ్యాపారం చెయ్యడానికి కాంగ్రెస్సు, దక్షిణభారతహిందీప్రచారసభకు అధికారం ఇచ్చింది. పైగా సుమారు అయిదువేల రూపాయలు కూడా విరాళం యిచ్చింది. దీనికి ప్రతిఫలంగా హిందీప్రచారసభ అయిదువందలప్రతులు మాత్రం కాంగ్రెస్సుకమిటీ కివ్వడం. తతిమ్మా అనేకవేల ప్రతుల అమ్మకం అంతా తాను స్వేచ్ఛగా వాడుకోడం—అంటే దక్షిణదేశభాషలను చంపి వాటి స్థానే హిందీని ప్రవేశపెట్టడం—ఇదీ నిర్ణయం. అఖిలభారతదేశానికి సంబంధించిన కాంగ్రెస్సు ఇలాగ వ్యక్తుల పలుకుబడిని బట్టి ప్రత్యేక రాష్ట్రాల ప్రయోజనాలకు సాధకం కావడం దురదృష్టం.

హఠాత్ అంటే పారిపోయే పిల్లి, నాలుగు తలుపులూ బిగించి కొట్టబోతే, ప్రాణాలకు తెగించి మీదబడి, రక్కి గుడ్లు పీకేస్తుంది. జనవరి ౨౪ వ తేదీని గుంటూరిలో సమావేశమయిన గుంటూరు యువజనమహాసభ "హిందీభాషను భారతదేశమున కంతకును సామాన్యభాషగ జేయుటకై జరుపబడుచున్న ఉద్యమముయెడల "తీవ్రముగ అసమ్మతి తెలుపుచు ప్రతిరాష్ట్రమునందును మాతృభాషలనే రాజభాషగ నుంచి సామాన్యదేశభాషగ అంతర్దేశీయ ప్రాముఖ్యముగల ఆంగ్లభాషనే ప్రవేశపెట్టవలె" నని తీర్మానము ప్రతిపాదించి బహుళసంఖ్యాకులచే అంగీకరింపచేసింది. గుంటూరుజిల్లాలోనే ఇలాంటి ప్రాతికూల్యం ప్రారంభం కావడం చాలా ప్రశంసించతగ్గది.

# సరస్వతీగ్రంథమండలి




కంభంవారి సత్రమువీథి ** రాజమహేంద్రవరము

నవలలు - నవరసభరితములగు నవలలు—ముచ్చటగూర్చు బొమ్మలతో—ముద్దులొలుకు క్యాలికో యిండుతో—రెం[...]ములకొక చక్రాని నవల. నడుమ నడుమ చిన్నచిన్న అను ఇతరగ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము [...] దారులు ఒకేసారి రు 7 8 0 ను ముందుగా పంపిన యెడల వరుసగా ఆయాపుస్తకములు అన్‌రిజస్టర్డు పార్శిలుగా పంపుదుము.

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 11 ప్రేమసుందరి | 1 8 0 | 25 కుంకుమభరణి | 1 8 0 | 39 అగ్రహారము | 1 8 0 |
| 12 చోరశిఖామణి | 1 8 0 | 26 జాగిలము | 1 8 0 | 40 ఛిన్నహస్తము (1వ భాగము) | 1 8 0 |
| 13 లక్ష్మీప్రసాదము | 1 8 0 | 27 మొగలాయీదర్బారు 2 భా॥ | 1 8 0 | 41 ఛిన్నహస్తము (2వ భాగము) | 1 8 0 |
| 14 హత్యారహస్యము | 1 8 0 | 28 సరస్వతి | 1 8 0 | 42 కంకణరహస్యము | 1 8 0 |
| 15 ఫాస్టు (1వ భాగము) | 1 8 0 | 29 ఆనందీబాయి | 1 8 0 | 43 సంజీవి (1వ భాగము) | 1 8 0 |
| 16 ఫాస్టు (2వ భాగము) | 1 8 0 | 30 హత్యాన్వేషణము | 1 8 0 | 44 సంజీవి (2వ భాగము) | 1 8 0 |
| 17 కుముద్వతి | 1 8 0 | 31 మొగలాయీదర్బారు 3 భా॥ | 1 8 0 | 45 రాజరాణి | 1 8 0 |
| 18 చిన్నకోడలు | 1 8 0 | 32 గంగ | 1 8 0 | 46 హత్యాక్రమ | 1 8 0 |
| 19 రహస్యభేదనము | 1 8 0 | 33 మొగలాయీదర్బారు 4 భా॥ | 1 8 0 | 47 కాశీఖండము | 1 8 0 |
| 20 సింహగడము | 1 8 0 | 34 కోహినూరు | 1 8 0 | 48 సేవాశ్రమము (1వ భాగము) | 1 8 0 |
| 21 మణిహారము | 1 8 0 | 35 ఆటీన్ మణేలా | 1 8 0 | 49 సేవాశ్రమము (2వ భాగము) | 1 8 0 |
| 22 మొగలాయీదర్బారు 1 భా॥ | 1 8 0 | 36 అపరచిత | 1 8 0 | 50 దాసీకన్య | 1 8 0 |
| 23 ఘటనాచక్రము | 1 8 0 | 37 అంతఃపురము (1వ భాగము) | 1 8 0 | | |
| 24 రాజసుందరి | 1 8 0 | 38 అంతఃపురము (2వ భాగము) | 1 8 0 | | |

## అనుబంధములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మృత్యురంగిణి | 0 12 0 | 9 యమునాబాయి | 1 0 0 | 17 లలిత | 1 0 0 |
| 2 అభాగిని | 0 12 0 | 10 శ్యామల | 1 0 0 | 18 పెండ్లిదండె | 1 0 0 |
| 3 ఛద్మవేషి | 0 12 0 | 11 కాంతంకథలు (చిన్నకథలు) | 1 0 0 | 19 కథావళి | 1 0 0 |
| 4 విదురుని యుపదేశములు | 1 0 0 | 12 కాలసర్పి | 1 0 0 | 20 నాలుగుకథలు | 1 0 0 |
| 5 కాంచనమాల | 1 0 0 | 13 భాగవతకథాసారం | 1 0 0 | 21 స్త్రీప్రబోధిక | 1 0 0 |
| 6 సీమంతిని | 1 0 0 | 14 కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 0 0 | 22 ఆదర్శము (1వ భాగము) | 0 12 0 |
| 7 సుశీల | 1 0 0 | 15 అరక్షణీయ | 1 0 0 | 23 ఉదంకుడు | 0 12 0 |
| 8 శశిరేఖ | 1 0 0 | 16 మాధవి | 1 0 0 | 24 భేతాళకథలు | 0 12 0 |

## నాటకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మార్కండేయ | 0 12 0 | 5 షాజహాను | 1 0 0 | 9 దంపతులు | 1 0 0 |
| 2 అహల్యాశాపవిమోచనము | 0 12 0 | 6 నూర్జహాను | 1 0 0 | 10 విజయవిజయం | 1 0 0 |
| 3 మీవారుపతనము | 1 0 0 | 7 దుర్గాదాసు | 1 0 0 | 11 భక్తకుచేల | 1 0 0 |
| 4 వరమాల | 1 0 0 | 8 చంద్రగుప్త | 1 0 0 | | |

 ఈ గ్రంథములు రాజమండ్రీలో కలాభివర్ధనీ పరిషత్తులోను దొరకును.

**కుంకుమపూవు** :— కాశ్మీరజ - కుంకుమ — Corcus-Salivus Eng. Saffron

స్వరూపము — ఇది కాశ్మీర దేశము నందును, హీరా దేశమునందును పుట్టు సుగంధద్రవ్యము. దీని కేసరము లెఱ్ఱగను, కొంచెము తెల్లగను యుండును. రంగు వేయబడిన కృత్రిమ కుంకుమపువ్వు బజారులో గలదు. కుంకుమపువ్వు చేతిలో నలిపిన రంగంటుకొనక యుండినచో నది, అసలైనదని తెలియవలెను. నీటిలో వేసిన నీరు పచ్చబడక యుండినది శ్రేష్ఠమైనది. అసలైన కుంకుమపూవు కొంచెము చమురుగలిగి యుండును.

గుణములు — ఇది కారము, చేదు, రుచులు గలది. వేడిచేయు స్వభావము గలది. విపాకమున కారపు రుచిగ మారును. లఘుగుణము. వాతకఫములు హరించును. దగ్గులు కట్టును. విషదోషములు శమించును. కంఠరోగములు, తలనొప్పులు పోవును. వీర్యవృద్ధియు ధాతుపుష్టియును గలిగించును. ముక్కు, చెవి, కన్ను, నోరు, శిరస్సు మొదలగు నూర్ధ్వజత్రుగత రోగములను శమింపజేయును.

ప్రయోగము — అశ్మరీ-కృచ్ఛ్రములకు .— కుంకుమపూవు ద్రాక్ష రసములో కలిపి త్రాగిన సర్వకృచ్ఛ్రములు, అశ్మరులు శమించును. (చి. 26 అ. చరకము.)

మూత్రనిరోధజ-ఉదావర్తమునకు .— కుంకుమపూవు కషాయమును లోనికి త్రాగిన ఉదావర్తము తగ్గును.

మూత్రాఘాతములకు :— కుంకుమపూవు మెత్తగా నూరి నీటిలో కలిపి దానిలో తేనె వేసి రాత్రి నిలవయుంచి ప్రాతఃకాలమున త్రాగిన మూత్రకృచ్ఛ్రములు తప్పక శమించును. (59 అ. సుశ్రుతము)

శిరోరోగములకు :— కుంకుమపూవును పంచదారయును గలిపి ఆవునేతిలో వేచి నస్యము చేయించియుండ మోదించిన కనుబొమలమధ్యను, కణతలయందును, నేత్రములయందును, చెవులయందును, సూర్యావర్తకమను శూలయు శమించును. (చక్రదత్త)

బొల్లికి :— రేలవేరు నీటిలో నరగదీసి ఆగంధములో కుంకుమపూవు కలిపి బొల్లికి రాసిన బొలులు తగ్గును. ముఖముపై మొటిమలుకూడ తగ్గును.

ప్రసవస్త్రీ మైలరక్తశోధనకు :— రెండు చిన్నముల కుంకుమపూవును 6 మిరియములును కలిపి నీళ్లతో నూరి ప్రసవస్త్రీకిచ్చిన గర్భశోధనము చేయించి మైలరక్తమును వెడలించును. జ్వరమును కూడ రాకుండ కాపాడును.

నేత్రరోగములకు .— గంధము గంధములో కుంకుమపూవు కలిపి కంటిచుట్టును పట్టువేసిన కంటివ్యాధులు తగ్గును. మరియు నిమ్మపండ్ల రసములో కరక్కాయి అరగదీసి దానిలో కుంకుమపూవు కలిపి కంటిచుట్టు పట్టువేసిన నేత్రరోగములు తగ్గును.

# గంధర్వకళ

## రక్తపుష్టి, వీర్యవృద్ధి, నరములకు బిగి కలిగించు తియ్యని లేహ్యము

అనేకులకు మరల మగతనము కలిగించి మెప్పుపొందినది

గంధర్వకళ—యౌవనము సంఘటించును. శుక్లనష్టము కట్టును. పుంస్త్వము పెంపుచేయును. కామోద్రేకము కలిగించును. సంభోగశక్తి హెచ్చుచేయును. మనోల్లాసము కూర్చును. ఆనందము కలిగించును. ప్రమేహములను జయించును.

కీళ్ళనొప్పులు, దురదలు, తిమ్మెరలు, పోనాడుటలో గంధర్వకళ ప్రత్యేకశక్తికలది. నవామేహములమీద ఇది చేయుపని అసాధారణమైనది. దీనిని ఎప్పుడును సేవించుచుండినచో ముసలితనము కనబడదు. ఏవ్యాధులును చేరవు. ఇది బాలెంతరాండ్రకును చాల మేలుచేయును. వారి శరీరములకు పూర్వపుబిగి కలిగించును. పౌను రు ౩—౦—౦

# మలయచందనము

## సెగరోగమునకు పేరుపొందిన ఔషధము

పోటీలలో నెగ్గినది. నకళ్ళను చూచి మోసపోకుడు

ఈ క్రూరవ్యాధివలన బాధపడువారికి మా మలయచందనము నాలుగువందల యేండ్లనుండి గురుపరంపరగా వాడబడుచున్నది. ఇది సంస్థానములయందును రాజకుటుంబములయందును వాడుటకు కనిపెట్టబడినది. కావుననే పథ్యము లేదు. పిచికారీతో పనిలేదు. సెగరోగము తగిలినట్లు, మందు పుచ్చుకొనుచున్నట్లు యెవరికీ తెలియగూడదంటే మా మలయచందన మొక్కటే అందుకు తగినది. నకళ్లు బయలుదేరుచున్నవి. పరిశీలించకుండ ఏ యౌషధమును పుచ్చుకోవద్దు. గంధర్వఫార్మసీవారి మలయచందనమే కావలెనని కోరుడు. అనేక వైద్యులు సొంతమందులను విడిచి దీనిని వాడి విజయము, బహుమతులు పొందుచున్నారు. మూడుపూటలలో గుణమిచ్చును. ఎరుపు, తెలుపు, పచ్చసెగలకు ఇది రామబాణము. రస విష గంధకములు చేరని మూలికాయోగము. ఇక్కడకు అక్కడకు పరుగెత్తక నేడే మాకు వ్రాయుడు.

డబ్బీ ౨—౮—౦ దీని కనుపానము చందనతైలము ఔన్సు ౩—౦—౦ రెండును ఖర్చులతో ౬—౦—౦

# నాగరఖండము

అజీర్ణములకు శూలలకు, పరిణామశూలలకు చాలమంచిది. ఆకలిలేకపోవుట, కడుపుఉబ్బరము, నొప్పి, నోట నీళ్ళూరుట కడుపులో మంట, పొత్తికడుపులో పోటు, కండ్లమంట, ఓకిరింత, వాంతులు, పుల్లత్రేనుపులు, భస్మిక, అరుచి—వీటిని త్వరగా తగ్గించును. విడువకుండ ఒక్కపౌను సేవించినచో ఎట్టి గురుపదార్థమైనను సులభముగా జీర్ణమై, పూరట ఆకలి కరకరలాడును. రక్తపుష్టి కలిగించును. పౌను రు ౩—౦—౦

**గంధర్వఫార్మసీ—ఇన్నిస్ పేట, రాజమండ్రి**

Reg. N. M. 3048 PRABUDDHANDHRA

# శాస్త్రీయౌషధములు

## వాసావలేహ్యము

ఉబ్బసముతో బాధపడువారు ఇది వాడిన యెడల ఈ రోగికి నిమిషములో బంధమును విప్పుటలో దీనికి చాల శక్తి గలదు. క్రోడమును శుభ్రపరిచి, ఘనీభవించిన శ్లేష్మమును కరిగించి, శ్వాస, నిర్మూలంగా ఉబ్బసవ్యాధిని నిర్మూలము చేయును. మరియు యిది రక్తపిత్తము, ఉరఃక్షతము, దగ్గులు, క్షయ—వీటికి గూడ అమోఘమైనది. సామాన్యంగా మలబంధముతో బాధపడువారికి కొందరకని ఇది అత్యుపయోగకరము. పౌను 1కి 3_0_0

## మహాఖండార్ద్రకలేహ్యము

మహారాజులు సుకుమారులు వాడదగిన ఔషధము పైత్యమువలన కలిగే సకలబాధలను సమూలముగను శీఘ్రముగను దూరము చేయును ఇది ఆమము పచనము చేసి, రుచి పుట్టించి ఆకలి కరకర లాడించును. శరీరపుష్టి, వీర్యవృద్ధి కలిగించును. అమ్లపిత్తము, శూల, పాండువు, శ్వాసకాసలు, కామల, పీనస, గుల్మము, కంఠరోగములు వీటిని జయించును. మలబంధమును పోగొట్టుటలో దీనికి ప్రత్యేకశక్తి కలదు. పౌను 3_0_0

## మహాభృంగరాజతైలము

నరసిన వెండ్రుకలను నల్లగుచును. వెండ్రుకలను రాలనివ్వదు. చెవిపోట్లు కంటిజబ్బులు తగ్గించును. శిరోవ్యాధులను వేరనివ్వదు. వెండ్రుకలను నల్లగను, మృదువుగను, పొడవుగను, గుబురుగను పెంచును. హాయిని తైలతో దినదినము బాధపడువారు దీనివలన శాశ్వతఫలమును పొందగలరు. నమ్మకమైనది
8 ఔన్సుల సీసా 2_0_0

## భృంగామలకతైలము

శిరస్సు వేడిగానుండుట, తలనొప్పి, కండ్లమంట, శిరోజములు తెల్లబడుట, రాలిపోవుట మున్నగు బాధలను అత్యల్పకాలముగా తగ్గించును. కండ్లకు చలువచేయును. చుండు పుట్టనీయదు అనిద్రను తగ్గించి సుఖనిద్ర కలిగించును. వెండ్రుకలను తుమ్మెదరెక్కలవలె నల్లబరుచును. మరియు కర్ణశూలలు, ఉన్మాదరోగములు, అపస్మారములు తగ్గించును. 4 ఔన్సులు 0-10_0 పౌను 2-0-0.

## గంధర్వదంతచూర్ణము

ఇది బజారు బూడిదలరకము కాదు. ఆయుర్వేదయోగము. దంతవ్యాధులను, ముఖవ్యాధులను పోగొట్టును. నోటదుర్వాసన, పుచ్చి, దంతములనుండి రక్తముపడుట తగ్గించును. ఘుమఘుమలాడు చక్కని చూర్ణము. డబ్బీ 0_4_0

## గంధర్వకస్తూరిమాత్రలు

చంటిపిల్లల జలుబు, దగ్గు, ఎడిసెము, అజీర్తి, విరేచనములు, ఆకలి లేకపోవుట, అన్నహితవు లేకుండుట, పాలు త్రాగకుండుట, కడుపు ఉబ్బరము, కడుపునొప్పి, డోకులు, జ్వరము, ఆయాసము అతిశీఘ్రముగా తగ్గించును. బాలెంతలకున్ను మిక్కిలి మేలుచేయును. సీసా 0_8_0

## ద్రాక్షారిష్టము

దగ్గు, పగర్పు, క్షయ, మున్నగు కఫవ్యాధులకు మంచిది రక్తపిత్తము ఉరఃక్షతము, తగ్గించును కఫవ్యాధి పీడితులకు కోష్ఠమును శుద్ధపరచుటలో దీనికి ప్రత్యేకశక్తి యున్నది. బలవంతులును, ఆరోగ్యవంతులును గూడ దీనిని ఎప్పుడును వాడుచుండినచో చాల మేలు చేయును. బలకారి. తియ్యనిమందు. పౌను. 1_8_0

## ధాతురంజని

సంభోగసమయమున శీఘ్రస్ఖలనము కాకుండునట్లు చేయుటకిది తయారుచేయబడినది. దీనిని సేవించినచో పురుషుల ఆనందమును స్త్రీలకు ప్రీతియును కలుగును. ఇది స్త్రీవశ్యము చేయు అమోఘౌషధము వీర్యస్తంభనము కోరు పురుషులు రాత్రి భోజనానంతరము సేవింపవలెను. ఒక్క గంటలో చెప్పినంత పని చేయును. 16 మాత్రలు 1-0-0

## వైక్రాంతభస్మము

కఫవ్యాధులలో చాల పనిచేయును. శ్లేష్మ ఉడుకు, మూత్రకృచ్ఛ్రములు తగ్గించును. వీర్యవృద్ధి, తేజస్సు కలిగించును. అనుపానభేదములతో అనేక గుణములు కలిగించును. తులము 2_0_0

## అయస్కాంతభస్మము

ఉబ్బు (నంజు) పాండువు, క్షయ, శ్వాసకాసలు, అపస్మారలు తగ్గించును. రక్తశుద్ధి చేయుటలో చాలశక్తి కలది. బలము, కాంతి, వర్చస్సు, నరములకు బిగి కలిగించును. తులము 3_0_0

రోగవివరాలు తెలుపువారికి ఔషధములు నిర్ణయించి పంపెదము.

## గంధర్వఫార్మసీ—ఇన్నిస్‌పేట, రాజమండ్రి

రాజమహేంద్రవరము: శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుంగారి సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రితమై
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే ప్రకటింపఁబడినది. 28-2-[illegible]